

పంచతంత్రం

# మిత్రలాభం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి












































సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 25
18-2-53

నందన ఫాల్గుణ శుద్ధ పంచమి; బుధవారం



ఉదయపూరు "రాచనగరు" ఉద్యానవనంలోని జలయంత్రం

ఫోటో: శ్రీ టి. సత్యనారాయణమూర్తిగారు, విస్సర్

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :

శ్రీమతి టి. సూర్యకుమారి.


| | |
|---|---|
| కార్నర్ సీట్— | 4 |
| గోడమీద బొమ్మ— | 8 |
| మీరూ అంతేనా?— | 12 |
| విజ్ఞానవీథులు— | 24 |
| మా అన్నయ్య— | 26 |
| అందమైన పూలు— | 30 |
| విచిత్ర వ్యక్తి— | 31 |
| గానుగెద్దు— | 34 |
| చదువుకొనే గది— | 36 |
| జంతుకోటిలో మానవలక్షణాలు | 40 |
| సినిమా— | 44 |
| ప్రశ్నలు—సమాధానాలు | 48 |


# కాలక్షేపం

అనివార్యమైన కొన్ని కారణాలవల్ల 'కాలక్షేపం' అను శీర్షిక క్రింద శ్రీ దాసు వామనరావు గారి వ్యాసాన్ని ఈవారం ప్రచురించలేక పోయినాము. తిరిగి త్వరలోనే ఈవ్యాసావళి ప్రారంభించ బడుతుంది.

సంపాదకుడు.

# రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు వానిని త్రిప్పి పంపగోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులనుగాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన పెద్దకవర్లనుగాని చేర్చి పంపవలసిందని మనవి. స్టాంపులను పంపేవారికి మాత్రమే వారి రచనలనుగాని, చిత్రాలనుగాని ప్రచురించేముందు ప్రచురణ విషయమై తెలియపరచగలము. మొదట స్టాంపులనుచేర్చి పంపక, తరువాత ఉత్తరాలు వ్రాసి స్టాంపులు పంపినట్లయితే, వటికి పంపడం కష్టమని రచయితలూ, చిత్రకారులూ గుర్తించప్రార్థన. ఈ సందర్భములో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము.

# కార్నర్ సీట్

స్టేషన్లోకి ట్రెయిన్ వచ్చి చాలా సేపయింది. ఇంక ఏ క్షణంలో బయల్దేరి పోతుందో అనే ఆందోళనతో, కుడి చేత్తో టిక్కెట్టూ, ఎడం చేత్తో తోలు సంచీ పట్టుకుని పరిగెత్తేడు రాజా ప్లాట్ ఫారంవైపు.

పచ్చకోటు తొడుక్కొని ముందు పోతూన్న ఒకణ్ణి తోసేయబోతూంటే అతణ్ణి టిక్కెట్టు అడక్కుండా రాజాని ఆపేసి "ఎందుకలా గాభరా పడతావయ్యా! ఎక్కడానికి టైముందిలే" అని కసిరేడు గేటు దగ్గర టిక్కెట్టుకలెక్టరు.

టికెట్ కలెక్టరు ఆపినందుకూ కసిరినందుకూ కించపడలేదు రాజా.

"అవా! ఇంకా టైముందండీ?" అని నిటూర్చి ప్రశ్నించేడు.

"ఓ! చచ్చినంత!" అన్నాడు టి. సీ. టిక్కెట్టు పంచ్ చేస్తూ.

పచ్చకోటు తొడుక్కున్నవాడు ప్లాట్ ఫారంలోకి ముందుగా పోయేడు. ఆ వెనకే రాజా కూడా వెళ్ళేడు.

మేనల్లుడి పెళ్ళికి వెళ్ళకపోతే బావుండదని బయల్దేరేడు. ఆ బండీ తప్పిపోతే ఇహ పెళ్ళికి వెళ్ళినట్టే! బండీ తప్పిపోయిందని అక్కయ్య నమ్మదు. బావకి కోపంవస్తుంది. పెళ్ళిళ్ళ రోజులవడంచేత ట్రెయిన్లో జనం కిటకిటలాడుతున్నారు. ఎక్కడా ఖాళీ ఉన్నట్టు లేదు.

"ఏదో బండి అంటూ దొరికింది. అదే పదివేలు. ఎక్కడో అక్కడ ఇరుక్కొని కాలక్షేపం చేసేస్తాను" అనుకొంటూ ఇంజన్ వైపు నడిచేడు రాజా.

చివరిదాకా నడిచి "అదృష్టం బావుంది" అనుకున్నాడు. ఆఖరి కంపార్ట్ మెంటు చాలా ఖాళీగా వుంది. కిటికీలోంచి లోనికి చూస్తే వెనకవైపు కిటికీదగ్గర కార్నర్ సీట్లో ఎవరూ ఉన్నట్టుగా లేదు. మరీ అదృష్టం!

"నా అదృష్టం బావుందీ రోజున" అని సంతోషిస్తూ లోనికిఎక్కబోయేడు రాజా.

అతనికంటె ఒక్కడుగు ముందరయేడు పచ్చకోటువాడు. ముందడంలో తిన్నగా పోయి వెనకవైపున కిటికీపక్క మూల సీట్లో కూర్చున్నాడు. అతణ్ణి వెనక్కితోసెయ్యడానికి వీలుచిక్కని రాజు అగ్గిరాముడై పోయేడు.

"నే నెక్కడ ముందుగా వెళ్ళి అక్కడ కూర్చుంటానో అని జోరుగా పరుగెత్తిపోయి మరీ కూర్చున్నాడు దొంగ వెధవ" అని అతణ్ణి మనసులో తిట్టుకొంటూ గత్యంతరం లేక అతనికి ఎదట సీట్లో కూర్చున్నాడు. కొంచెం సర్దుకొని, టిక్కెట్టు పర్సులో భద్రంగా పెట్టి, పర్సు జాగ్రత్తగా జేబులో పెట్టి, సంచీ వారకి పెట్టి, చెప్పులు కిందని విడిచి, మఠం వేసుక్కూర్చొని కంపార్ట్ మెంటంతా కలయజూసేడు. ప్రయాణీకులంతా కలిపి పది మందికంటె ఎక్కువలేరు. అంత తక్కువ మంది ఉన్నప్పటికీ కూడా తనకి కార్నర్ సీటు కిటికీ పక్క దొరకనందుకు అతనికి చిరాకు వేసింది. కోపం కలిగింది. పచ్చకోటువాణ్ణి చూస్తే వళ్లు మండుకొచ్చింది.

## "కాంతా కాంత"

ముందు కిటికీదగ్గర ఈ వెధవ సుఖంగా కూర్చున్నాడు.

వెనక కిటికీ దగ్గర ఇంకో వెధవెవడో అంత సుఖంగానూ కూర్చున్నాడు.

మధ్య తను!

ఎదట వాడివైపు చుర చురచూసేడు.

ఎదట వాడు తొడుక్కున్న పచ్చకోటు చెప్పలేనంతగా మాసింది. అతను తొడుక్కున్న షర్టు తెల్లగా పువ్వులా ఉంది. కట్టుకున్న మాసీ మాయని పంచ అక్కడక్కడ చిరిగింది. నెత్తిమీద పెట్టుకున్న నల్లటి మరాఠీటోపీ కింద జుత్తుబాగా పండినట్టు కనిపిస్తోంది. అతని వయసు నలభై సంవత్సరాలకి మించకపోవచ్చు. ముక్కు చాలా ఎత్తుగా ఉండడంచేతా, కళ్ళు చాలా లోతుకు పోవడంచేతా, మనిషి, గెద్దలా ఉన్నాడు. అతను ఎవ్వరివైపూ చూడ్డంలేదు. కిటికీలో ఎడంచెయ్యి ఆన్చుకొని, కాల్తున్న సిగరెట్టు కుడి చేత్తో పట్టుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"వీడి పిండాకూడుగాని పచ్చరంగు కోటు తొడుక్కోడం ఏమిటి!" అని రాజా అనుకొంటూండగా ట్రెయిన్ కదిలింది. రాజా న్యూస్ పేపర్ తీసేముందు చుట్టముట్టించేడు.

పేపర్లో అతనికి నచ్చిన వార్త లేవీ కనిపించడంలేదు. మలయా పరిస్థితి గురించి భారతం గ్రంథమంత రాసేరు. కొరియా యుద్ధంగురించి చేటభారతం రాసేరు.

ఎవడిక్కావాలీ వెధవ గోల! ఛీ! ఛూ! అనుకొంటూ ఉమ్మికొందికి లేచేడు రాజా.

ఉమ్మికోడానికి లేచి కిటికీ దగ్గరకి పోవాలి. అక్కడే కూర్చుంటే ఎంత బావుండేది!

ఆ వెధవ హాయిగా కూర్చున్నాడు! వాడి పక్కనే కిటికీవైపు కూర్చుంటేనేం? అలా చేస్తే ఈ కార్నర్ సీటు కూడా వదులుకోవలసి వస్తుంది. దూరప్రయాణమాయె తనది.

తిరిగి తన సీట్లో కూర్చొని పేపరు చదవబోయేడు.

కొరియన్ వార్, వాంటెడ్ కాలమ్స్, ట్రూమన్ స్పీచ్, సోప్ అడ్వర్టయిజ్మెంట్స్!

"ఛస్ ఎవడిక్కావాలి వెధవఘోష!" అని పేపరు మడతపెట్టేశాడు. ఇంకేమీ చేసేదిలేక అటూ ఇటూ చూస్తూ కూర్చున్నాడు చుట్ట కాలుస్తూ.

ఏదో స్టేషను దగ్గరవుతూన్నట్టుంది.

ఈ పాడుబండీ ప్రతీ వూళ్ళోనూ ఆగేట్టుంది. ఈ ఫక్కీని వెళ్తే పెళ్ళయిన పదో నాటికి చేరేట్టున్నాను, అక్కడికి. కళ్లు మూసుకొని కిటికీవార పడుక్కున్నా బావుండేది. వాడు దిగిపోతే బావుణ్ణు. వాడు ఎక్కడ దిగుతాడో?

"మీ రెక్కడండీ దిగుతారూ?" అని పచ్చకోటువాణ్ని ప్రశ్నించేడు. అతను జవాబు చెప్పలేదు. రాజా వేసిన ప్రశ్న విన్నట్టుగానే లేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. సిగరెట్టు మాటిమాటికీ పీలుస్తున్నాడు. ఎండిపోయిన పెదవుల్ని



అతను ఎవ్వరివైపూ చూడ్డంలేదు......కాల్తున్న సిగరెట్టు కుడిచేత్తో పట్టుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

పాలికతో తడిచేసుకొంటున్నాడు. కూర్చున్న చోట్లోనే అటూ ఇటూ కదులుతున్నాడు. లోతుకుపోయిన కళ్ళతో లోపల లోతుల్లోకి చూసుకొంటున్నాడు. ప్రశ్న వేస్తే జవాబు చెప్పడేం?

"ఏమండోయ్, మిమ్మల్నే!" అని గట్టిగా అరిచేడు రాజు. సుఖంగా నిద్ర పోదామని సిద్ధమయేసరికి పక్కనున్నవాళ్లు అల్లరిచేస్తే ఎంత కోపంగా ఉంటుందో అలా వుంది పచ్చకోటువాడి ముఖం.

"ఏం? ఎందుకూ?" అని విసుగ్గా అడిగేడు.

"ఏవూరు వెళ్తున్నారూ?"

"ఎక్కడికో అక్కడికి వెళ్తాను. మీకేల? దయచేసి మీ మానాన్న మీరు కూర్చొని నన్ను కూర్చోనివ్వండి."

అతను చాలా విసుక్కున్నాడు. తల మీద టోపీతీసి విసురుగా బల్లమీద పడేశాడు. వెనక సీట్లో ఎవరో నవ్వుతున్నట్టుంది అతని జవాబుకి.

ఏమిటీ? వీడి పొగరూ??

ఎంత తెగులుగావుంది దౌర్భాగ్యపు వెధవకి!!

దౌర్భాగ్యపు వెధవవైపు కొరకొర లాడుతూ చూసేడు రాజు. టోపీ తీసేయడంలో అతని ఎండిన పండిన పీచు జుత్తు గాలికి ఎగురుతూ చెదురుతోంది. చెవులు బాగా పెద్దవిగా కనిపిస్తున్నాయి. అతని గడ్డంబాగా మాసింది. రాజు కంటికి అతను ఎంతో వికృతంగా కనిపించేడు.

చెవల వెధవ! మర్యాదా లేదు మప్పితం లేదు. జవాబివ్వలేడేం సరిగ్గా! పోనీ నాకేం! జాతి చూపరా బసవా అన్నట్టుగా వాడి గుణం వాడు చూపించుకున్నాడు. కాని గోజల్లా నా ఎదట దిష్టిపిడతలా కూర్చుంటాడు కాబోలు.

లోలోపల మండిపోతూ కూర్చున్నాడు రాజు.

వీడెక్కడికి వెళ్తే నాకేం? ఎక్కడికో అక్కడికి వెళ్తాడు. వల్లకాట్లోకి పోతాడు. నాకేల? కాని, పెట్టేబేడా ఏ వల్లకాడూ తెచ్చుకోలేదే వీడు! వీడి వాటం చూస్తే టిక్కెట్టు కొన్నవాళ్లా లేడు.

టికెట్ కలెక్టర్ వస్తే వీణ్ణి దింపించి పారెయ్యవచ్చు.

ఒక స్టేషనప్పుడే దాటిపోయింది. కాని టి. సీ. ఇంకా రాడేం? ఎవడూ కనిపించడే! పూర్వం ఇలాగే వుండేదా? అడుగడుక్కీ వచ్చి చెక్ చేసేవారు. ఇప్పుడంతా ఇలా తగలడుతూందేం? ఛా! ఛా! డబ్బిచ్చి కొన్నవాడు బాధపడ్డం! కానీ ఇవ్వకుండా వచ్చినవాడూ సుఖపడ్డం! ఇలా అయితే ఎలా చావడం? ఆనెస్ట్ పీపుల్ కష్టపడి నష్టపోవలసి వస్తోందని ఎవ్వడూ గుర్తించడే! ఛా!

పచ్చకోటువాడు దగ్గడం ప్రారంభించేడు, బాధగా, కఫంగా, అసహ్యంగా. దగ్గిదగ్గి కిటికీలోంచి పైకి ఉమ్మి కోటు చేత్తో మూతి తుడుచుకొని "హమ్మయ్యా" అని ఆయాసం తీర్చుకున్నాడు.

వీడికి క్షయ రోగం ఉన్నట్టుంది. జబ్బులున్న వాళ్ళని ట్రెయిన్‌లోకి ఎందుకు రానిస్తారో! అధికార్లకి బుద్ధి లేదు. వీడికి టీ. బీ. వుంది. అనుమానం లేదు. చచ్చేట్టున్నాడు. ఈ వెధవ ఈ క్షణంలో చస్తే నేనయి విచారించను. భూభారం ఎంత తగ్గినా తగ్గడమే!

మరో స్టేషన్ వచ్చింది. ట్రెయిను ఆగింది. ఇద్దరు బికార్లు దిగిపోయేరు.

ఈ బికారి కూడా ఇక్కడ దిగిపోతే బావుణ్ణు అని రాజు అనుకొంటూ ఉండగానే పచ్చకోటువాడు ఏదో నిశ్చయానికి వచ్చినట్టుగా గభాల్న లేచి కంపార్ట్‌మెంట్‌లోంచి వెనక గుమ్మంలోంచి వెనక వైపుకి దిగిపోయేడు.

పోయేడు ఫకీరు వెధవ! నిజంగా పోయి నట్టేనా? టోపీ వదిలీసేడే! మళ్ళీ వస్తుంది కాబోలు కనిదేవత. టీ. సీ. వస్తాడని భయపడ్డాడో ఏమో?



# పల్లెపడుచులు

ఫోటో: శ్రీ ఏ. వి. నరసింగరావు, రాజమండ్రి.

వెనక్కి తిరిగి చూస్తే ప్లాట్‌ఫారం కనిపిస్తోంది. ప్లాట్‌ఫారంమీద మనుష్యులు కనిపించడంలేదు, లేరుకా బట్టి. అటువైపు కిటికీదగ్గర అంతవరకూ కూర్చున్న వాడు హాయిగా పడక వేసేడు. వాడి వైపు చూడలేక ముందుకి ముఖం తిప్పుకున్నాడు రాజు.

బండీ కదుల్తే బావుండు ననుకొంటూ లేచి ఎదట కిటికీలోంచి పైకి చూసేడు.

ఇడుగో పచ్చకోటువాడు! ఇక్కడే నిల్చున్నాడు, మాసిన పచ్చకోటూ వీడూ. బండీ కదల భయం, మళ్లీ ఎక్కిపోతాడు.

అతన్ని చూస్తూ అలాగే నిల్చుండిపోయేడు రాజు, కిటికీదగ్గర.

పగలు పదిగంటల చలికాలపు ఎండలో పచ్చకోటువాడు ప్రశాంతంగా గంభీరంగా నిల్చున్నాడు. గర్వంగా ఠీవిగా ఉన్నాడు. అతని కళ్లలో వెలుగు కనిపిస్తోంది. అతన్లో ఏదో తేజస్సు ప్రజ్వరిల్లుతున్నట్టుగా ఉంది. జగత్తునంతా తృణీకరించి చూస్తున్నట్టుగా ఉన్నాడు. నిర్లక్ష్యంగా నిటారుగా నిల్చున్నాడు.

అబ్బో! వీడికి ఇంతడాబు ఎక్కణ్ణించి వచ్చింది? అని రాజు అనుకొంటూ ఉండగానే ఇంజన్ గర్జించింది. గాడీ కదిలింది.

పచ్చకోటువాడు బండీ ఎక్కడానికి తొందరపడలేదు. నిల్చున్న చోటునుంచి కదల్లేదు.

వీడు ఇక్కడే ఉండిపోతాడు కాబోలు. బతికేను. ట్రెయిన్ పదిగజాలు నడిచింది. పాతిక గజాలు దాటింది. అంతే!

కాని అదేమిటి? అదేమిటి?

పచ్చకోటువాణ్ణి చూస్తూన్న రాజు ఒక్క కేక వేసేడు. ఎవరో ఛయిన్ లాగేరు. ఎంతో అయిష్టతతో బండీ ఆగింది.

రాజుకి ముఖం తిరిగింది. మూర్ఛవచ్చేట్టయింది. పచ్చకోటు వాడి మెడ రైలు పట్టాపైన, ట్రెయిన్ చక్రాలకింద; ఇనప పట్టామీద. ఇనప చక్రాల దిగువ! అవతల తల; ఇవతల మొండెం; ఇందాట్టా ప్రాణం; ఇప్పుడిప్పుడే మరణం!

ఒక్కసారిగా, ఒకేసారిగా, "అయ్యయ్యో, అమ్మో అయ్యో, ఎంత పనెంత పని చేసేడు, ఎలా ఎలా ఎలా చేసేడు, శంకరా హరహరా, ఈశ్వరా పర్మేశ్వరా."

బండీలో ఉన్న జనం అంతా వెనక వైపుకే దిగుతున్నారు. గోలగోల, ఒకటే గోల! పోలీసులు, టీసీలు, ప్రయాణీకులు, కేకలు.

ఇటువంటి సీన్సు నే చూడలేను అనుకొంటూనే చేత్తో సంచీపట్టుకొని, బండి

(55-వ పేజీ చూడండి)



"వాణి"

చిత్రకారుడు: శ్రీ రమేశ్ చంద్ర, హైదరాబాద్.

# గోడ మీద బొమ్మ

శ్రీ బలివాడ కాంతరావు (చిన్ననవల)

(గత సంచిక తరువాయి)

## 7

ముప్ఫయ్యో తేదీ సాయంత్రం ఆఫీసు నించి వస్తూ, వెంకట్రావు ముందురోజు సాయంత్రం జరిగిన సంఘటన చెప్తూ "చెప్పుదెబ్బ గ్రాండ్ గా తగిలించేవాడినే. కాంతం సర్వవిధాలా మెరుగని వూరుకున్నాను" అని చివరను వ్యాఖ్యానించాడు.

రామంవద్దనుండి నాలుగు సానుభూతి వాక్యాలు కాంక్షించిన వెంకట్రావు బావ వేపు ఒకసారి యెగాదిగా చూచి, "మనిషి యిక్కడ వున్నా మనసెక్కడో! ఏం చెప్పానో విననైనా విన్నావా? ఆ దరిద్రగొట్టు – చూడు – దశకోటి ఆలోచనలతో వున్నాడు. మీ మామయ్యదగ్గర యిలా అబద్ధాలు చెప్పి యేమైనా పిండుదామని చూస్తున్నాడు."

"కిష్టయ్య అడగకుండా మామయ్య యేమిచ్చినా సంతోషించేవాడిని" అన్నాడు నెమ్మదిగా రామం.

"*What do you mean?*" నువ్వు మంచీ చెడ్డా ఆలోచించవోయ్. వాడివన్నీ వేషాలు - పెళ్లాం గయ్యాళిగంప. మాకు కొంచెం దగ్గరదని వాడి మాటలాడితే నన్ను సాగదీసి లెంపకాయి నువ్వే కొడ్తావు. ఉన్న *fact*, చేప్తున్నాను. భద్రం నుయింటికి రాకుండా చేస్తున్నది యెవరంటావు? ఇలా ముసలాయన్ని విసిగిత్తించి దోచుకుందామని చూస్తూంటే! ఇదంతా గన్ పౌడరు ప్లాటోయి!"

"ఆ ప్లాట్ మాటకేంగాని బావా! యిప్పుడు యేం చెయ్యటానికి తోచకుండా వుంది."

"నిన్న మళ్ళీ వాడితో చెప్పాను. ఆ సత్తిముండావాడు వాడి జన్మలో నిజం చెప్తాడా? ఎంత చెప్పినా వాడి మాట వాడిదేనని నాన్పేశాడులే."

రామం పెద్ద నిట్టూర్పు విడిచాడు. అడుగులు చాల మెల్లగ పడుతున్నాయి. వెంకట్రావు రామం భుజంపై చేయి వేస్తూ,

"నువ్వింత కృంగిపోవటం నాకేం నచ్చలేదు. మనకి చేతనయినదల్లా చేశాము. ఆవిడ వస్తుంటే నివ్వెందు కేడవాలి— నీమీద అభిమానమే వుంటే నువ్వు తినమంటే తినకూడదూ? నాకిలాంటివి చూస్తే ఒళ్లు మండిపోతుంది సుమా!"

"నువ్వు తేల్చేసినంత వేగంగా నేనెలా తేల్చేస్తాను బావా? నాకేం తోచటంలేదు."

"సరి! ఇలా విచారిస్తూ, ఆఫీసులో పనేం చేస్తావు?"

"ఈవేళ యెప్పుడూ లేనిది నాల్గు చీవాట్లు కూడ తిన్నాను."

"*Silly.* ఒక్కరోజున యేదో చిన్న పొరబాటు చేస్తే తిట్టేయటమే. ఇలాంటి ఆఫీసర్లకి సరియైనవాడ్ని నేనే. శెలవుపెట్టి మూడుచెరువులు నీరు త్రాగించేవాడిని."

"చేతినింపుగా పని వుండేటప్పుడు శెలవుపెట్టడం మంచిదంటావా? పెట్టినా యిస్తారనా!"

"ఇదేమిటోయ్! ఆడదాని కబుర్లాడతావు. ఇలాగే ఒక శ్వేతముఖుడు, మా మేనత్త చచ్చిపోయింది శెలవు కావాలిరా అంటే, నీ పెళ్ళాం చావలేదుగా శెలవు యీయటానికి వీల్లేదన్నాడు. రౌద్రం మండిపోయిందనుకో – వాళ్ళకి ఫేమిలీ అంటే పెళ్ళాం పిల్లలూ కాని మన కెలా ఔతుంది? స్వయం మేనత్త పరలోకప్రాప్తి పొందితే, వద్దనటానికి వాడికేం హక్కుందని – నీ వుద్యోగం నీదగ్గరే పెట్టుకోమని, మెడికల్ లీవు పదిరోజులకు పెట్టేశాను. చచ్చినట్టు ఎవడికోసం యిస్తాడు. మళ్లీ డ్యూటీలో జాయినయ్యాక నన్ను చూచి కోతిలా అయ్యేవాడు. ఏదైనా సమయంరాదా, వీడిపని పట్టిస్తా ననుకున్నాను. పనిముట్లతో కుస్తీపట్టిన కంసాలి యేంపని చేస్తాడోయి! ఈ పెద్దపెద్ద ఆఫీసర్ల బ్రతుకులన్నీ మన చేతిలోనే వుంటాయి. వీళ్ళ అహంభావాలకు తగినట్లు మనం వుండాలి కాని, చిత్తం బత్తెం అంటుంటే మనల్ని పాతెయ్యరూ?"

రామం ఊఁ కొడ్తూ, చీమనడకలు నడుస్తున్నాడు. వెంకట్రావుకీ ధోరణి చాల ఆనందాన్నివ్వటంవల్ల వాగ్ధాటిని ఆపలేదు.

"రెండు నెలలవరకూ ఆ మంచిరోజు రాలేదు. సిగ్నల్ స్టేషనుకు యినస్పెక్షన్ కి వచ్చివెళ్లాక రింగ్ చేశాడు. ఆ కాల్ అదృష్టవశాత్తు నేనే అందుకున్నాను. అబ్బే, మీ విక్కడేమీ మరచిపోలేదని చెప్పాను. దట్స ఆల్ రైట్ అన్నాడు. ఆ వెండి సిగరెట్టు కేస్ వుప్పుటేట్లో విసరేశాను కిటికీగుండా."

రామంకు నవ్వాగింది కాదు. ఎంతో ప్రయత్నంమీద ఆపుకుంటూ, "పారేసే బదులు జేబులో పెట్టలేకపోయావా!"

"ఛా! ఛా! ఒకరిసొత్తు ఛస్తే ముట్టానటోయ్."

రామం యీసారి గట్టిగా నవ్వేశాడు.

"ఇంకొకటి కూడ చెప్పుకోవాలి. ఆఫీసరంటే వాడేలే. ఇప్పుడొస్తున్న బేడా పరక సరుకు కాదు. ఇంత ఎస్టాబ్లిష్మెంటు వాడిచేతిలో వున్నప్పుడు యేమిచేసినా చెల్లేది. ఒక్క దమ్మిడి ముట్టేవాడు కాదు. చివరకు వాడి తోటలో మొక్కలకు వాడే నీరుపోసుకొనేవాడు. ఇప్పటికి వచ్చిన ఏ యూరోపియన్ ఆఫీసరు చచ్చినట్టు నన్ను పిలవని రోజుండేది కాదనుకో - అందరిలో ఠంచన్ గా జవాబు చెప్పేవాడిని నేనే. తక్కిన వాళ్లలా కాళ్లు పట్టడం నాకు పుట్టుకతో చేతగాదు. అలాంటి ఆఫీసర్లు, ఆరోజులు పోయాయి."

రామం నవ్వుతూ, "మనవాళ్ళ నంత చులకన చేయకు బావా!"

"మనలో లేరని కాదోయి. కాని అలాంటి ఆఫీసర్లను వేళ్ళమీద లెఖ్ఖపెట్టాలి. ఇప్పుడు మనందరికి మొగుడున్నాడే-వాడిగురించి దగ్గరున్నావ్ - నీకేం తెలుసు. నన్నడుగు నే చెప్తాను. ఏకసంతగ్రాహి. ఇంగ్లీషులో సరస్వతీ ప్రసన్నుడు. మూడు వందల ప్రశ్నలకు, మూడు వాక్యాలలో జవాబు చెప్తాడు."

రామం ఫకాలుమన్నాడు.

"నిజం కాదంటావా బావా? నువ్వేం చూశావు. నేను తిరిగిన సొసైటీ అటువంటిది. ప్రొఫెసర్ కృష్ణారావని వుండేవాడు. పోయాడులే. ఆయన ఇంగ్లీషులో మంచి నీరు త్రాగవోయి అని అంటే అర్థం చేసుకోలేక పోయేవాళ్ళం. మళ్ళీ సామ్యూల్ జాన్సన్ యీ రూపంలో పుట్టాడా అనిపించేది." కొంచెం గొంతుక ధాటి తగ్గించి, "ఒకసారి ఆయన దగ్గరకు వెళ్ళి మాట్లాడవలసిన అవసరం వచ్చింది. నాకు మొదట భయం వేసింది. ఐనా తంటన్‌గా నిల్చొని ఇంగ్లీషులో వాగాను. చివరకు యెంత వరకు చదువుకున్నావబ్బాయి అన్నాడు. అబద్ధం యెందుకు చెప్పాలి. మూడుసార్లు మెట్రిక్ చూశానన్నాను. దానితో *Please* అయిపోయి నా భుజం తట్టాడంటే నమ్ము."

"బావా! ఎంత అదృష్టం" అన్నాడు నవ్వు నాపుకుని రామం.

"నేమువ్ అయిన సొసైటీ, ఆ హేపీ డేస్ గురించి ఎవరితోను చెప్పనోయి. చెప్తే నీవంటివారు కోతలనేస్తారు. ఎందుచేతనంటే యీ కాలంవాళ్లు అన్నీ వాళ్ళ దృష్టితోనే చూస్తారు. కాలం మారిపోయింది. ఒకడి ఎదురుగా తియ్యని కబుర్లాడి వెనక మోసంతో ముంచేస్తారు. ఆ కాలం మనుష్యుల్లో వుండే న్యాయం, నిజాయతీలు యీ కాలంలో వాళ్ళలో లేదు."

"నువ్వు లేదని చూస్తూంటే మరెక్కడ కనిపిస్తుంది."

"నువ్వేం చెప్పు-ఈ చదువులు మనల్నేం వుద్ధరించడం లేదంటే నమ్ము. ఈరోజుల్లో పట్టభద్రుడు తప్పులేకుండా తెలుగుమాట అటుంచు ఇంగ్లీషులో ఒక వాక్యం రాయలేడు. చదువుకున్న అమ్మాయి పెళ్ళి చేసుకోదు. చేసుకున్నా సరిగ్గా కాపురం చెయ్యదు. ఆరోజుల్లో - నే కళ్లార చూశాను. బి. ఏ. చదువుకున్నావిడ మడి కట్టుకుని వండటం, పిల్లలక్రింద మొగుడు క్రింద ఒళ్ళు వంచి కష్టపడటం - ఆరోజుల్లో వుండే మొగాళ్ళు వేరు. ఎవరు చెయ్యవలసిన పని వారిది - యెక్కడుండవలసిన వాళ్ళక్కడ - ఇక ఇప్పుడో, నువ్వే అంటావు. నా పెళ్ళాం యౌవన సుకుమార కోమలాంగి. పెళ్లాం నేనూ కలిసి బియ్యం కడిగాము. కూరగాయలు తరిగాము - ఇవటోయ్ చేసుకోవటం, చెప్పుకోవటమున్నూ?"

ఈమాటల్లోపడి రామం వెంకట్రావు వెంట వచ్చాడు. "క్రొత్తరోడ్డు ఎలానూ దాటిపోయాం. అలా యింటిదగ్గర కాస్త కాఫీదేవతను సేవించి పోదువుగాని రా." ఏనాడూ లేనిది ఆహ్వానించాడు వెంకట్రావు.

ఇంటికి వెళ్ళేసరికి రవణమ్మ, "ఈరోజుకి హోటల్లో కాఫీ త్రాగండి" అంది. అదేమిటంటే పిల్లి పాలు ముట్టేసిందిట.

"ఉంచావా, పారబోశావా?" ప్రశ్నించాడు వెంకట్రావు. పారబోశానంది రవణమ్మ. "పిల్లి ముట్టినంతమాత్రాన్నే పాలు పారబోయటమే. మనం యిలా తగలడతాంగానీ బావా! ఉన్న ఫేక్టు చెప్తున్నా, దొరలు కుక్కనోటిలో రొట్టి తీసికుని తింటారు."

"అక్కా! ఇకముందు రోజు పిల్లిచే ముట్టించి మరీ పాలు బావకిద్దూ!"

"మరేం ఫరవాలేదు. నీకు తెలియదు కామోసు మాయింటిపిల్లులు ఎలకల్ని ముట్టవోయి"

రామంకు కాఫీ తాగినంతగా కడుపు పొంగింది. వెంకట్రావు కొద్దిగానైనా తొణకకుండా అన్నాడు. "*Fact* చెప్తే నవ్వుతారుగానీ ఎలకల్ని పట్టని పిల్లులుండవూ?"

జవాబుగా "వస్తానుబావా!" అంటూ రామం లేచిపోయాడు. వెంటవస్తూ, "నే వెళ్లి మాట్లాడుతానులే. నువ్వు తిన్నగా యింటికి వెళ్లి విశ్రాంతి తీసికో."

"ఒకసారి వెళ్లివస్తాను!"

"నే నెందుకు చెప్తున్నాను విను." బలవంతాన అత్తారింటి వైపు రామంని త్రోశాడు. వెంకట్రావు కొంచం మంచినీరు త్రాగి పొరుగుయింటికి వెళ్లాడు. రంగయ్యగారు మౌనంగా కుర్చీ చూపించారు. కూర్చుంటూనే "ఇంకా బజారుకు పోవాలి" అన్నాడు.

"ఏమైనా మంచి చేపలు పడుతున్నాయా, బాబూ!"

"పడకేమండీ, రోజూ అటువేపు వెళ్ళకుండా ఉండలేను. అందుచేతనే నన్ను కొందరు బెంగాల్‌లో పుట్టవలసిన మనిషివోయి, అని అంటుంటారులెండి. చెప్పాలో వద్దూ—చేపలు మెదడుని దివ్యంగా వుంచుతాయండీ!"

"రుచికి ఏటి చేపలేనోయ్. నా కెప్పుడైనా జ్వరం వస్తే మందేమిటని అడగవేం? మంచి ఏటిచేప కారం హెచ్చువేసి రెండుపూటలా తింటే సరి. ఇంత జ్వరం కూడ ఎగిరిపోయేది"

"ఇప్పుడొచ్చాయండీ యీ ఇంజక్షన్లు, యీ వేషాలున్నూ. కాస్త కాలు యిరుకు పడితే ఒక మంత్రంతో పోయేదానికి, పది ఇంజక్షన్లిచ్చి నానా అట్టహాసం చేసిపారేస్తారు."

"ఎంతైనా మనదేశ వైద్యంతో సాటియేదీ లేదు నాయనా! రాను రాను అది బుగ్గిలో కలిసిపోతోంది. దాన్ని వుద్ధరించే దాత దైవం కనబడలేదు. నాకు చిన్నప్పుడు వుబ్బసం వుండేదిట. ఒక బైరాగి చిటికతో యీనాటికీ మనిషినెలా వుంచిందో చూడు."

"అది వాస్తవమేనండి. అన్నట్టు మీతో ఒక విషయం మనవి చేద్దామని వచ్చాను — మరేం కాదు - నరసమ్మగారితో మీరు గట్టిగా చెప్పి వుపవాసం విరమించేట్టు చూడాలి."

"చిన్నపిల్లా బాబూ, బుజ్జగించటానికి? దాని మంచిది తెలుసుకోకపోతే పాడయ్యేదెవరు?" లేచిపోతూ "ముద్దించి, అతిగారాబం చేసి వాడికి చదువబ్బకుండా పాడుచేసింది! ఇప్పుడనుభవిస్తోంది."

"ఉన్న *fact* చెప్తున్నాను. ఇలాంటి వాళ్లు గడ్డి వేసి పడుకోమంటే వూరుకుంటారా? తిరిగి చెప్పినవాళ్ళపైనే వేస్తారు. కాస్త మోటుపదం అంటున్నాను. భంచెత్ లేరా, గుర్రానికి గడ్డి వెయ్యరా అని గదిరితే వచ్చినట్లు వేస్తారు. అన్నిటికీ మీరు వూరుకోవడం యింతవరకూ వచ్చింది. నాదగ్గర లోసుగు పనికిరాదు."

రంగయ్యగారు దరహాసవదనంతో, "నువ్వనేది నిజమే నాయనా!" అన్నారు. ఇలా ఒప్పుకోవడం వెంకట్రావు కెంతో ఆనందాన్ని కలిగించటంవల్ల డిప్పలావున్న తల వెనుకభాగం పైకెగసింది. అలా దించిన తల పక్కకు త్రిప్పుతూ కులాసాగా నవ్వుకున్నాడు.

"బజారు వెళ్తావుకామోసు వెళ్ళు నాయనా!" అని రంగయ్యగారు చుట్ట వెలిగించారు వెంకట్రావు లేచిపోతూ, "నిన్న కిష్టయ్య చెప్పిన మాటలు నమ్మకని నాకు ధైర్యమేలెండి. వాడి సంగతి మీకింకా తెలియదు. నాకు వాడ్ని చిన్నప్పటినుండి తెలుసు. నోరు విప్పితే అబద్ధం. ఇది లేదని అది లేదని దొంగకబుర్లు ఆడతాడు. ఏం డబ్బు యియ్యగలరు?"

రంగయ్యగారికి యేదో స్ఫురించటం వలన ఆగి దగ్గరకు వచ్చారు. వెంకట్రావు మళ్ళీ అన్నాడు. "మన భద్రాన్ని యింటికి రాకుండా వాడే చేస్తున్నాడండీ. ఆడది ముక్కుకు తాడుగట్టి లాగితే వడిచే మనిషి. వాడు. ఒక దమ్మిడీ యివ్వకండి."

రంగయ్యగారు చిరునగవుతో, "మంచి విషయం జ్ఞాపకం చేశావు నాయనా! నా కిప్పుడూ తోచనేలేదు."

"నే చెప్పటమెందుకు? మీకు తెలియదనా? కలవిప్పించండి" అంటూ, అసలు



# గోడమీద బొమ్మ



విషయం పరిష్కారం కాకపోయినా తృప్తిగా వెళ్ళిపోయాడు.

ఆ వేళనే చీకటి పడుతుండగానే, భార్య దగ్గర అబద్ధమాడి యీ సంకట పరిస్థితినుంచి తప్పుకోవాలని కిష్టయ్య భీష్మించుకున్నాడు. కానీ భార్య యెదుటపడగానే అడిగానని చెప్పలేక, ఒకసారి రంగయ్యగార్ని చూశాక ఏవో నాలుగు మాటలాడి, ఏమీ లేదన్నారని అప్పుడే అబద్ధం చెప్పవచ్చునన్న ధీమాతో రంగయ్యగారింటికి వచ్చాడు.

ఆ సమయానికి ముసలాయన దీపం వెలిగించి ప్రదక్షిణ చేస్తూ, "రామయ తండ్రి" అని కూర్చుంటూనే, బయట నిల్చున్న కిష్టయ్యను చూసి, "రా బాబు! కూర్చో" అన్నారు.

కిష్టయ్య చిన్నమీసాల లోతుముఖం దించి కూర్చున్నా, యెలా నోరువిప్పి యీ విషయానికి ప్రస్తావన మొదలు పెటడమా అని ఆలోచిస్తున్నాడు. తన ఎదురుగా రంగయ్యగారు లేరన్న విషయం, "నాయనా! యిలా వస్తావటోయి" అని పిలచేవరకు గమనించలేదు. ముసలాయన ఇనప్పెట్టె తెరచి నిల్చున్నారు. చేతిలో నోట్లకట్ట వుంది. కిష్టయ్య గుండెదడ హెచ్చింది. వణకుతూన్న కాళ్ళతోనే ఆయన్ను సమీపించాడు. వణకుతున్న ఆ చేతుల్లో నోట్లకట్టలు పెట్టూ రెండుచేతులు పట్టుకుని, "గాభరాపడకు నాయనా! నాకొక మహానుభావుడు ఒకరోజున వెయ్యి రూపాయిలు వర్తకం చేసికోమని యివ్వకపోతే యీ భాగ్యభోగ్యాలు అనుభవించేవాడినా? ఈ వేయి రూపాయలు తీసికుని వెళ్ళి, నలుగురిలో తలెత్తి బ్రతికేటట్టు అమ్మాయిని ఒక యింటిదాన్ని చెయ్యి."

ముసలాయన చేతులు విడిచిపెట్టినా కిష్టయ్య భక్తిచే తన్మయమంది మూర్ఛ వచ్చినవానివలెవున్నాడు. ఇనప్పెట్టె తాళం వేసి, కిష్టయ్య భుజమ్మీద చెయ్యివేసి ముందుకు పోతూ, "నే నీకు యిచ్చినట్లు మీదంపతులకు తప్ప యింకెవ్వరికీ తెలియకూడదు సుమా, వెళ్ళు నాయనా!" అన్నారు.

ఏడు వందరూపాయలనోట్లు, ముప్పయి పది రూపాయల నోట్లకట్ట జేబులో పెట్టి చేతులు జోడించాడు. ముసలాయన చెయ్యి దీవనగా యెత్తి, "శుభం" అన్నారు.

కిష్టయ్య యెకాయెకి వెళ్ళి వంటయింట్లో చొరబడ్డాడు. బుడ్డి దీపం వెలుగులో చేతిలో గరిట పట్టుకుని పొయ్యిమీద కూర కలుపుతోంది సీతాలక్ష్మి. "సీతాలూ" అని వుత్సాహంతో గొణిగాడు. సీతాలు లేచి నిల్చుని భర్తవైపు చూడగానే మెల్లగా గాబరాగా "ఇ ఇచ్చారే - వె-వెయ్యిరూపాయిలే-"

"వెయ్యిరూపాయిలే" సీతాలు గట్టిగా నిట్టూర్చి భర్తభుజాలమీద ఆ గరిటె పట్టుకునే రెండుచేతులనూ వేసింది. ఇద్దరూ వణికిపోతున్నారు. కిష్టయ్య జేబులోంచి డబ్బు తీసేసరికి సీతాలు మళ్ళీ హృదయంనించి గొణిగింది. "వెయ్యి రూపాయిలే" అని. చేతులవణకు కొంచెం తగ్గినా కొద్ది తడబాటు లేకపోలేదు. సంకోచించకుండానే, "ప-పదిరూపాయిలే తక్కువ" అన్నాడు.

"ఇప్పుడే వెయ్యి రూపాయిలని అన్నారు" డబ్బు అందుకుంటూనే అంది సీతాలు.

"నే-నేను లెఖ్ఖపెట్టేనా యేమా?... ఆయనే చెప్తే"

"అంత యిచ్చినదాత పదిరూపాయిలే తక్కువ చేస్తారా?"

ఇంతవరకూ గొణుక్కోవటంతో జరిగిన సంభాషణయొక్క స్వరస్థాయి కొంచెం హెచ్చించి, "పె-పెట్టె అంతా వెతికితే అంతే దొ-దొరికిందే!"

"పోనీ వూరుకోండి" అంటూ అర్ధోక్తిలో భర్తమాటల నాపింది. గదిలోనికి వెళ్ళి, "నాన్న వచ్చారు. అటు వెళ్ళండ్రా" అని అరచి, పిల్లల్ని బయటకు పంపించేసింది. ఎక్కడా కనపడని నాన్నని వంటయింట్లో పొయ్యిమీదనుంచి గుడ్డ సహాయంతో కూరగిన్నె దించుతున్న తండ్రిని కనుక్కున్నాడు మల్లిగాడు. సీతాలు పెట్టితాళంతీసి అత్తారి కర్రభరిణలో డబ్బు దాస్తూంటే, అమ్మాజీ దగ్గర కూర్చుంది. "మా అమ్మ" అని ఒకసారి కూతురి తల నిమిరి సీతాలు లేచింది.

భోజనం అవుతుండగా అంది, "ఎవరికైన యీ మాట చెప్పగలరు! భద్రం తమ్ముడితో కూడ చెప్పకండి."

"ఆ-ఆయనే మనిద్దరికి తప్పించి..."

"ఆ బాబుకుమాత్రం తెలియదా లోకం సంగతి" అంటూ యేదో స్ఫురణకు రావటంవల్ల భర్త అడక్కుండానే కూర వేసి గదిలోనికి వెళ్ళింది. వంటయింటి కెదురుగా వరండాలో కిష్టయ్య భోజనం చేస్తున్నాడు. గది తలుపు చారవేసి కిష్టయ్య కమీజు ఒకసారి వెతికి వస్తూనే, "ఈ పెట్టె తాళం మంచిది కాదండి. కొత్తది కొనాలి" అంది.

తను దొంగను పట్టలేకపోయినందుకు పొందిన చింత ఆ గొంతుకలో యిమిడే వుంది.

భర్త లేచిపోయే వేళకు మెల్లగా అంది. "కానీకి చెయ్యి చాపితే పొమ్మనే రోజులివి. అలాంటిది యింత సొమ్ము యిచ్చారే! అంత మంచి మనిషికి యెంతైనా ఋణపడివుంటాం."

కిష్టయ్య భార్య మాటతో యేకీభవిస్తున్నట్లుగా తల వూపాడు. సీతాలు అలా వంటయింటి గుమ్మానికి చేరపడే అంది. "ఆ శ్రీరామచంద్రునికి వుడత చూపించిన భక్తిలా - యేదో మన చేతనైంది చేద్దాం!"

"ఏం చేస్తాం? మ-మన చేతనయ్యేదేముంది?"

"భద్రం తమ్ముడిని యింటికి వెళ్ళేటట్టు చేద్దాం."

"వింటాడూ?"

"అదంతా నాకు వదలెయ్యండి. మీరు మధ్య నేమీ మాట్లాడకుండా వుంటే చాలు. రేపురాత్రికి భోజనానికి రమ్మన్నానని ఆఫీసుకు వెళ్ళేముందు ఒకసారి కొట్టుకు వెళ్ళి మరీమరీ చెప్పండి."

కిష్టయ్య లేస్తూ, "నీ-నీకు పుణ్యం వస్తుందే!" అన్నాడు. సీతాలు భర్త వదలిన అన్నంగిన్నెలో నిండుగా గంజి పోసి కూర్చుంది.

## 8

కిష్టయ్య పాతమార్కెట్లో కూరగాయలు కొని; తిరిగి వస్తూనే వెనుకకు తిరిగి దగ్గరలో నేవున్న భద్రంకొట్టుకి వెళ్ళాడు. భద్రం అప్పుడే కొట్టు తెరుస్తున్నాడు. ఎదురుగావున్న గోడ గడియారం యెనిమిది కొట్టింది.

కిష్టయ్యను చూడగానే భద్రం ముక్కు తుడుచుకుంటూ అన్నాడు. "ఇదేమిటి బావా! ప్రొద్దున్నే సంచితో తయారయ్యావ్? నీదయ - నీ చేతిబోణి యెలా వుంటుందో!"

సదా ప్రసన్నుడయిన కిష్టయ్య ముఖం చిరునవ్వుతో వెలిగించి అన్నాడు. "నా ద-దయేంటోయ్. ఇవన్నీ వే-వేషాలు!" భద్రం నవ్వి బావ చేతిలోని సంచి అందుకోబోతూంటే వారించి, "వ-వద్దులే" అంటూనే ఆ ప్రక్కని సంచిపెట్టి కుర్చీమీద కూర్చున్నాడు. భద్రం టేబిలుమీదనున్న లక్ష్మీదేవిపటంకు వూదుబత్తి వెలిగించి తగిలించాడు.

"ఏదో విశేషం వుంటేకాని యిలా

రావే! రాత్రంతా సినీమా లవ్‌తో నిద్ర పట్టినట్టుంది!"

ఈ ఎగతాళికి ఒక్కసారి పట్టబుద్ర గోక్కుంటూ, "అను-అనూ" అంటుండగానే రాములు వచ్చాడు. రాగానే యెదురుగా చేతులు కట్టుకుని నిలబడి రోజూ వల్లించే వాక్యాలు అని, ఇంకేమో చెప్పబోతుంటే, కిష్టయ్య అందుకున్నాడు. "నీ-నీయమ్మ బా-బాబుకి మొక్కుందని చెప్పేబదులు నీ-నీవు యీ బాబుకి ద-దండం అను మొదట!"

ఈ మాటలకు కుర్రాడు, యెదురుగా భద్రం లేకపోతే నవ్వేవాడే. కాని అలానే భయభక్తులతో నిల్చున్నాడు. భద్రం కిష్టయ్య మాటలకు బదులుగా, "వీళ్ళమ్మ సంగతి నీకు తెలియదులే బావా!" రాములు వైపుకు తిరిగి "ఒరే! రూపాయికి నేల్సు టేక్సు ఎంతరా?" అన్నాడు.

"కానీ బాబూ."

"నీకిచ్చిన పలకేదిరా?"

కుర్రాడు వణుకుతున్నాడు. "ఊఁ పలకేం?" అని గద్దించాడు భద్రం. కుర్రాడి కళ్ళలో నీరు తిరుగుతూంది.

"చెప్పవేం?" హుంకరించాడు.

"మా చెల్లెమ్మ యిరిసేసింది బాబూ"అని వణకే గొంతుకతో అన్నాడు.

"రాత్రి ఉ ఊలు దిద్దావా?"

"లేదు బాబూ!" కుర్రాడి కళ్ళలోనించి నీటి ధారలు ఆ నల్లచెక్కిళ్లపైనుండి రాలిపోతున్నాయి. అంతసేపు ఆ కుర్రవానివైపే చూస్తున్న కిష్టయ్య జాలిగొని చప్పున "పా-పాపం! ఊరుకోవోయ్"అన్నాడు.

"నువ్వూరుకోబావా!" అంటూ గసిరాడు భద్రం రుమాలుతో ముక్కు తుడుచుకుంటూ. మళ్ళీ కుర్రాడివేపు ఎర్రగ చూస్తూ,

"ఎంచేత దిద్దలేదూ? ఊఁ చెప్పూ?"

రాములు ముఖం దించివేసి హీనమైన దుఃఖస్వరంతో, "బుడ్డిలో నూన లేదు బాబూ! వొకటే తిన్నాం. వొకటే పలకుంటే, మాసిన్న సెల్లెమ్మ యెనకపాటున వచ్చి బల్లమీద పడిపోనాది." అబద్ధానికి అతీతుడై ఆగి ఆగి అంటున్న ఆ కుర్రవాని వేపు చూస్తూ కిష్టయ్య అన్నాడు "మ-మంచికుర్రాడు. ఆఁ ఆఁ నీ-నీ పేరేంటి?"

"రాములు" వ్యాకులపడుతూ చెప్పాడు.

కిష్టయ్య లేచి రాములు ముఖంలో ముఖం పెట్టి, "ఒరే! రాములు! బా-బాగా చదువుకున్నావంటే బా-బా గుపడ్తావ్. డ-డబ్బు, పెళ్లాం, పి-పిల్లలు, యిల్లువాకిలీ అన్నీ." భద్రం బైటకు వెళ్లి ముక్కు చీదుకునివస్తూ, "మీ యింట్లో దీపం లేనప్పుడు పలక పట్టుకుని నాదగ్గరకు వచ్చేయాలి. తెలిసిందా?" రాములు తలవూపాడు.

"ఇదిగో! ఆగ్లాసు తీసుకవెళ్లి కాఫీ తీసుకరా" అంటూ భద్రం పావలా రాములికిచ్చాడు.

"ఉ!త్త కాఫీయేనా?" కిష్టయ్య పెదాలు విరిచాడు. భద్రం నవ్వుతూ, మరో బేడ రాములు చేతికిచ్చి, ఇడ్లీ తీసుకరా"

"వే-వేడిసాంబారు కూడా!" కిష్టయ్య ఆర్డరు యిచ్చాడు. భద్రం అసలు విషయానికి దిగి, "బావా! అసలు యింత ప్రొద్దుటే పనిలేకుండా రావు, ఏకోవుంది విశేషం!"

"ఏ-ఏముందోయ్? రా-రాత్రికి భోజనానికి వచ్చేమని మీ-మీ అక్క చెప్పింది."

"భేష్! నీదయబావా! కొస్త కారం హెచ్చువేసి - మరి నాకిష్టమైన కూర లేవో నీకు తెలుసుగా!"

"వే-వేపాలు. కా-కానీ"

భద్రం ముసిముసి నవ్వుతో, "ఏమిటి బావా! యీ తంతు నాకిష్టమైన కూరలు పెట్టకపోతే నే రాను."

"మ-మధ్య నే నెవరినోయ్!—చూ-చూశావా? తల పండిపోతోంది."

చేతితోపట్టుకొని చూపిస్తున్న అంగుళం పొడవు జుత్తులో నెరసిన వెంట్రుక ఒక్కటీ లేకపోవటం చూచి భద్రం, "నీకేం బావా? ఇప్పుడు సినీమాలో హీరోగా యేక్టు చేయగలవు."

కిష్టయ్య పైకి గర్వంగానే బావను పడదొయ్యాలని తల వూపుతూ, "అసలు ని-నివ్వుమాత్రం తక్కువా? తో-తోకొక్కటి లేదు కాని."

భద్రం నవ్వుతూ, "మరి కంపులేకపోతే ఒక్క ముద్దయినా నోటికెళ్లదు."

"అది లే-లేకుండా పోతుందీ!" చేతిని నిర్లక్ష్యంగా వూపాడు.

"కు-కుర్రాడు మ-మంచివాడు సుమా!"

"ఎలా చెప్పావ్ బావా?"

"ము-ముఖంలోనే అ - అసలు గుంజె కాయ వుంటుంది. ఎ-ఎవడి పిల్లాడు?"

"తండ్రిలేడు-కొబ్బరితోటల్లో ఇల్లట."

కిష్టయ్య ఆశ్చర్యంగా "కొబ్బరి తోటలా?" అని ఆగి మళ్లీ అన్నాడు. "అక్కడి పిల్లలకి త-తండ్రిపేరు తె-తెలీదుటోయ్." కిష్టయ్య మాటల్లోని అంతరార్థం గ్రహించిన భద్రం అప్పుడే వస్తున్న కుర్రాడివేపు చూసి, "వీడు చెప్పగలడులే" అన్నాడు.

కిష్టయ్య టిఫినుకు లంకించుకున్నాడు. కుర్రాడు చేతులు కట్టుకుని నిల్చుని, "బాబూ! ముక్కులో మంచినూన

(52-వ పేజీ చూడండి)

ఒకరోజు మేమందరమూ కలిసి 'జ్యూ'కి వెళ్లామని బయలుదేరాం. దారిలో అయిన ఆలస్యం మూలంగా, మేము 'జ్యూ'కి చేరేసరికి ఐదు అయింది. గబగబా పులులు సింహాలూ వుండే బోనులు చూసి, కోతులు వుండే బోనుదగ్గరకు చేరుకొన్నాం. అప్పటికే 'జ్యూ' మూసేసే వేళ అయింది. అక్కడ పనిచేసే నౌకర్లు అన్నిటికీ తాళాలు వేసేస్తున్నారు. కోతులు అన్నీ ఒక్కసారిగా అరుపులు మొదలెట్టేశాయి. ఆ అరుపు ఎందుకో నాకు అర్థంకాక, అక్కడవున్న ఒక నౌకరును అడిగాను 'అవి అలా ఎందుకు అరుస్తున్నా'యని.

"వాటికి అదిమామూలేనండి. ఈ తాళాలు వేశాక మరి మనుష్యులు రారని వాటికీ తెలుసు. మనుష్యులను చూస్తున్నంతసేపే వాటికి వినోదంగా వుంటుందేమో; ఒకసారి యీతాళం వేసేశామాంటే మరి ఎప్పటికో కాని మనుష్యులు కనిపించరుకదాఅని వాటికీ దిగులండీ!" అన్నాడు ఆ నౌకరు.

# మాయా అంతేనా?

**శ్రీమతి చామర్తి సుందరమ్మ**

రైలు సకాలానికే ప్లాటుఫారము జేరింది. అది ఒక చిన్న స్టేషను అవడంచేత స్టేషనులో త్రొక్కిడి లేదు. గోపాలరావు తాను ముందు రైలు దిగి, బిడ్డలను దింపాడు. రమణి భర్తకు సామాను అందించి తాను దిగి చీర సవరించుకుంటూ పరిసరాలను పరిశీలిస్తున్నది. పుష్యమాసపు చలిరోజులు. అప్పుడే చీకటి నలుమూలల వ్యాపిస్తున్నది.

రమణి: నేను సామాను చూస్తుంటాను. త్వరగా వెళ్ళి కూలీని తీసుకురండి.

గోపా: ఇక్కడ కూలీ, గీలీ ఎవరు ఉండరు. అట్లా వెళ్లి బండి వచ్చిందేమో చూచివస్తా.

గోపాలరావు నాలుగడుగులు వేసే సరికి 'ఎవరూ, గోపాలం బాబేనా? వచ్చారా నాయనా' అంటూ రామయ్య తాత ఎదురు వచ్చినాడు. గోపాలరావు రామయ్యతో వెనుదిరిగి "ఇదిగో రమణి, రామయ్యతాత బండి తీసుకువచ్చినాడు. త్వరగా నడు."

రామయ్య సామాను తెచ్చి బండిలో పెట్టి "అమ్మా బండి ఎక్కండి" అన్నాడు.

రమ: బండి కట్టనిదే ఎట్లా ఎక్కడం?

గో: బండి కట్టిన తరువాత నీ వెక్కగలవా? నీ మొహం! మన ఊళ్లో రిక్షా ఎక్కినట్లు ముందు తొట్లోనుంచి ఎక్కితే తరవాత బండి ఎత్తి ఎడ్లను కడతాడు.

రమణి బండి ఎక్కింది. దట్టంగా పచ్చిగడ్డి పరచి తాటాకు చాప వేసియున్నది. గోపాలరావు తొట్లో కూర్చుని కొరడా చేత్తో పట్టుకున్నాడు. రామయ్య తాను తెచ్చిన లాంతరు వెలిగించి దాంతోపాటే చుట్ట ముట్టించి ఎడ్లతాళ్ళు పట్టుకుని ముందర బయలుదేరినాడు. ఇంటిముఖం పట్టిన ఎడ్లు చకచక నడుస్తున్నాయి. వాటి మెడలో మువ్వలు గలగల మ్రోగుతున్నాయి.

బండి ఎక్కిందే తడవుగా పిల్లలిద్దరు పడక వేసినారు. హోల్డాల్ పెట్టెకు జేరవేసి రమణి దానికి జేరబడి ఈజీచైరు వాటంలో పడుకున్నది. రైల్లో కూర్చొటానికేనా చోటులేక, నడుము తన్నుకుపోయి ఉండటంచేత రమణి ప్రాణం ఈ పడకవల్ల కాస్త కుదుటబడ్డది. బండి జోరుగా పోతున్నది.

గోపాలరావు చేరవలసిన ఊరు ఎనిమిది మైళ్లుంటుంది. అధమం రెండుగంటలైనా పడుతుంది అక్కడకు జేరడానికి. ఈ లోపున తనుకూడ ఒక కునుకుతీస్తే బాగుండును. కాని, పచ్చిగడ్డి పసరువాసన ఏదో వికారంగా ఉన్నది. తలలో ఎన్నో ఆలోచనలు ముసురుకుంటున్నాయి. తన తండ్రితాతల ఊరు తానేనాడూ వచ్చి యెరుగడు. తండ్రి చిన్నానాడే గతించడంచే తన తల్లి మేనమామవద్దనే ఉండిపోయినది. బిడ్డలులేని మామయ్య ఎంతో అల్లారుముద్దుగా పెంచి తనకీ చెల్లెలికీ విద్యాబుద్ధులు చెప్పించినాడు. తనకు జ్ఞానమువచ్చిన తరువాత విన్నది తన కిద్దరు పెదతండ్రులు, మేనత్త యున్నారని. తమ తండ్రి పట్నవాసం చదువుకొచ్చి, తన అన్నలకు బంధువర్గానికి ఇష్టంలేకపోయినా, తమ తల్లిని వివాహమాడినాడు. తత్ఫలితంగా అన్నదమ్ముల అనుబంధం తెగిపోవడం, ఆస్తిపాస్తులు తెగతెంపు చేసుకోడం జరిగింది. నిష్ఠాపరుడయిన రామచంద్రయ్య తమ్ముని శాఖాంతర వివాహమును సహించలేకపోయినాడు. తమ్ముని ఆకస్మిక మరణవార్తను వినికూడా ఆయన మరదలినిగాని, తమ్ముని బిడ్డలనుగాని పరామర్శింప తలపెట్టలేదు.

రమణికి చిన్ననాటి సంగతులన్నియు ఒకటి తరువాతగా ఒకటి జ్ఞప్తికి వచ్చుచున్నవి. తన రెండవ పెదతండ్రి కామరాజుకు జబ్బుచేసినప్పుడు ఆయనను పట్నం తీసుకువచ్చినారు. తన పెదతండ్రి రామచంద్రయ్య, మేనత్తరంగమ్మ, ఆమె కుమారుడు గోపాలరావుకూడ వచ్చినారు. తానప్పుడే తన తండ్రివైపు బంధువులను మొదటిసారిగా చూచినది. స్వతంత్ర బుద్ధియైన గోపాలరావు తన మామకిష్టముండదని తెలిసికూడ తమ ఇల్లువెతుక్కుంటూ వచ్చినాడు. తను, చెల్లి, సుశి, కూడబావను చూచి సంతోషించినారు. బావతో తనూ, చెల్లి ఆస్పత్రికి వెళ్ళినారు. రంగమ్మత్త అమాంతంగా కౌగిలించుకొని ఎంతగానో దుఃఖించింది. రెండవ పెద్దతండ్రి జబ్బుతో లేవలేని స్థితిలో ఉన్నాడు. మంచమువద్దకు రమ్మని తమ తలలు నిమిరి కంట తడిపెట్టడం ఇప్పటికీ కండ్లకుకట్టినట్లున్నది. ఆత్మీయులను చూచి ఆనందించవలసిన సమయంలో వాళ్ళట్లా ఏడ్వడం అసహ్యమనిపించింది తనకు. వారి గుండెలలోని బరువు తన కానాడేమి తెలుసు! తాను పన్నెండేండ్లదే నాయె! ఆనాడు పెదతండ్రి బుంగమొహం బుగ్గమీసాలతో పలకరించనేలేదు. వారవారగా చూడ్డమేగాని కళ్లార చూడనేలేకపోయినాడు. ఎఱ్ఱని అతనికళ్ళు తనకి భయమే కలగజేసెయి. పొంగిపొరలివచ్చే దుఃఖప్రవాహాన్ని నిగ్రహించే అతి ప్రయత్నమువల్లనే ఆ కళ్ళట్లుండవచ్చును. చిన్నతమ్ముని వియోగము, తన నిర్దాక్షిణ్యము ఆయనను కృంగదీసియుండును. తోబుట్టువులతో పట్టుదల ఎంత బాధాకరము! ఈ ఊహ వచ్చేసరికి రమణికి కడుపులో దేవినట్లయినది. ప్రపంచమంతా గిరగిర తిరుగుతున్నట్లనిపించింది. ఓక్కుమని వాంతి రాగా పక్కబద్దలు పట్టుకుని ముందుకు వంగినది. ఆ శబ్దానికి తొట్టిలోనున్న గోపాలరావు బండిలోకి ఒక్క అంగ వేసి రమణిని పట్టుకొన్నాడు. పిల్లలు మేలుకున్నారు.

రమణి: వదలండి స్థిమితపడ్డాను. ఏమిటో ఈ బండి ప్రయాణం భరించలేదు శరీరానికి.

గోపాలరావు: ప్రయాణమే కాదు. ఈ వాతావరణము, ఈ మనుష్యులూకూడ నీకు సరిపడరేమొ! అది చూసుకో. ఎక్కడికక్కడ సర్దుకుపోలేని మనుష్యులున్నారే, ఎందుకు పనికిరారు. ఇంకా నిద్రపోతున్నావనుకున్నాను!

రమ: నిద్రపోదామనే అనుకున్నాను వస్తేగా? పోనిండి నిద్రకేంగాని,— రామేశంఅన్నయ్య స్టేషనుకేనా రాలే

జేమా అని ? పనిపట్టి ఉత్తరంకూడ వ్రాసి వచ్చేవేమో ?"

గో : రెవిన్యూ ఇన్స్పెక్టరు వచ్చాట్ట గ్రామంలోకి. అధికారిని విడిచి మీ అన్న సేవను కట్లావస్తాడు! అదీకాక అతనే కనుక వస్తే తను చేసే కరణంపని కూడ తీరిక సారిక లేని బాధ్యతాయుతమైన పని అని నీ కెట్లా తెలిసివస్తుంది ?

ర. బాగుంది నా కన్ని తెలియవు. వెళ్లేది కొత్తచోటా, అక్కడెవర్నీ ఎరగ నాయిరి అత నొక్కడే తెలిసినవాడుకనుక అతనుకూడా ఉంటే బాగుండుననియున్నది.

గో : నే తెలిసినవాడినేగా. అక్కడందరికి నే పరిచయంచేస్తా నిన్ను. సరేనా? ఏదో ఇబ్బందిపడుతున్నట్టుంది నీ వ్యవహారం చూస్తే మొదటఉన్న ఉత్సాహం తగ్గిపోయినట్లున్నదప్పుడే. అతను పిలవగా పిలవగా ఇప్పటికి కుదిరింది మనకీ ప్రయాణం అదికాక, అతనెన్నిమాట్లు కోర్టుపనికని సిబ్బందీతో కూడా వచ్చి మనింట్లో తిష్ఠవెయ్యలేదు ? అనుకున్న ప్రోగ్రాము అన్నిటికి స్వస్తిచెప్పి 'పునః ప్రాణానాయమ్మా' యని నీ వెన్నిమాట్లు వార్చిపెట్టలేదు ? ఓ పదిరోజులుంటే భాగ్యానికి అంత మొహమాటం దేనికి ? ఏవీ, మనం తెచ్చిన ద్రాక్షపళ్ళూ అవీను? నాలుగుపళ్లు నోట్లోవేసుకుని, ఆలోచనలు కట్టిపెట్టి పడుకుంటివా ఆ వికారం తగ్గుతుంది. 'బాబ్జీ, ఆ బుట్టలోని పళ్లు ఇలా అందుకోమ్మా.'

ఈమాట వినేసరికి రాణి గబుక్కునలేచి కూర్చున్నది.

బాబ్జీ : నాన్నా అవి అమ్మ తినదు. మాకుకూడ పెట్టలేదు.

గో ఏం ఎందుకని ?

'మరేమొ-మరీ-అక్కడ-మన చుట్టాలికి ఉండాలిట. అవి తినొద్దూ అని అమ్మ రైల్లో బిస్కట్లు, అరటిపళ్లు, కొనిపెట్టింది నాన్నా.' అచి అచి పలుకుతూ రాణి తల్లి మీద ఫిర్యాదుచేసింది

గో 'బాగానే ఉంది తెలివి. బుట్టెడు పళ్లుంటే పిల్లలకేనా ఇవ్వకుండ మంచి గొప్పదానివే! అని గోపాలరావుపళ్ళబుట్ట తీసి పిల్లలకు బండిరామయ్యకు కొన్నిపళ్లి నిచ్చి రమణికి కొన్ని పళ్ళిచ్చినాడు. రమణిపండ్లు తీసుకుని మాట్లాడకపడుకున్నది. పిల్లలు ప్రొద్దుటినించి పీడిస్తున్న కోర్కె తీరటంతో సంతృప్తిపడి పడుకున్నారు.



"మాటవరస కంటూరుగాని నిలువెత్తుధనంపోస్తేమాత్రం ఉంటారేమిటి?" అంది రాజమ్మ. ఈమాటల వాటం అనుభవంలేనిరమణికి ఆశ్చర్యంకలిగించింది.

బండి కంకరరోడ్డు విడిచి పుంతమార్గాన పడినది. పచ్చి మిర్చి, ధనియాల తోటల మీదుగా వీచినగాలి ముక్కుపుటాలను జెల్లించుతున్నది. అక్కడక్కడ పొలాల్లో రైతులు వేసుకున్న చలిమంటలు తప్ప వేరే దృశ్యాలేవీ కనబడుటలేదు. ఎద్దుల మెడలోని మువ్వలధ్వనితప్ప వేరొకశబ్దమేమీ వినబడుటలేదు ఆ నిర్మల వాతావరణము, ఆ ప్రశాంతత రమణి కెంతో ఆహ్లాదకరంగా ఉన్నది తన పూర్వులు, పెద్దలు నివసించిన గ్రామమది. వారు రాకపోకలు సల్పిన మార్గమున తానీనాడు మొట్టమొదటిసారి ప్రయాణము చేయుచున్నది. మేనత్తకొడుకు గోపాలరావు తన్ను వివాహమే చేసుకొనక పోయిన, యీ ప్రయాణమున కవకాశమే యుండెడిది కాదేమొ — పట్టణములకు పల్లెలకు గల తారతమ్యమును రమణి యూహించుకొనుచున్నది. సంస్కారము, నాగరకతయను ముసుగు ధరించిన కపట జీవన మిక్కడ ఉండదు. తానీ పది రోజులు ఎంతో కులాసాగ గడుపబోవుచున్నది ఇవి తన జీవితమున మరపురాని రోజులుగ ఉండగలవు—కాని రమణిభావ పరంపర కడ్డుతగిలినది గ్రామపు

ప్రహసనాలు వ్రాసి పేరు సంపాదించిన ఒక రచయితను ఆపూరిలోని మహిళా మండలి వారు సన్మానించాలని తీర్మానించుకొని, సభ ఏర్పాటు చేశారు.

సభ జరుగుతున్నది. ఆ రచయిత లేచి మాట్లాడుతూ "నాకు ఆడవాళ్లతో మాట్లాడటమే ఎక్కువ సరదా..." అన్నాడు. సభ్యురాండ్రలో కొంత కలవరం బయలు దేరింది. ఆయన గమనించాడు... "అందుకు కారణం మరేమీ కాదు. మగవాళ్లకు ఏదైనా ఒక విషయం చెప్పామంటే, వాళ్లు ఒక చెవితో విని యింకొక చెవితో వదిలేస్తారు. ఆడవాళ్లు అల్లాకాదు. మనం చెప్పే ప్రతి విషయాన్నీ రెండు చెవులతోనూ విని, మళ్లీ నోట్లో నుంచీ వదిలేస్తారు," అన్నాడు.

# ★ మీరూ అంతేనా? ★

పొలిమేరలలో దుర్గంధము. గ్రామసింహముల స్వాగతము లామె నూహాప్రపంచమునుండి మేల్కొల్పి హెచ్చరిక చేసినవి.

* * *

'ఏమత్తా. ప్రొద్దుటే వచ్చారు?' అన్నది రాజమ్మ.

"చెప్పేరేకాదు! గోపాలం రమణి వస్తారని? నాంకేం తెలుసు. లేకపోతే రాత్రే వచ్చి చూసేదాన్ని. నారింజ కాయలు కావాలని శంకరం వచ్చేటప్పటికి 'ఇప్పుడెందుకురా ఈరాత్రివేళ, దొడ్లో పురుగూ పుట్రా ఉంటుంది, ఎట్లా కొయ్యడం' అంటే, వాడు చెప్పాడు. డోకులటకాదూ! ఉత్తిమనిషికూడా కాదు. రసం తాగేక తగ్గిందా అమ్మ. మా అమ్మే నా కళ్ళు కాలిపోతే రాత్రివచ్చి చూదామంటే ఇట్టె తుళ్లుమన్నాడు ఆ శంకరం. పిల్లలందరు పడుకున్నారు. ఒక్కదాన్ని చీకట్లో రాగలనా ఏమన్నా నా! పెద్దదాన్ని."

మొహం కడుక్కుంటున్న గోపాలరావు నవ్వుతూ అన్నాడు: "ఏం లక్ష్మమ్మత్తా, మీ యింటికిమాత్రం రాకుండా వెడతామా ఏమిటి? ముందు తెలిస్తే ఏం చేస్తావు? తెలిసి నీకొడుకు చేసినదేమిటి, నువ్వు చేయలేనిదేమిటి?

అక్కడేఉన్న రామేశం "చూడుపిన్నీ, వీడికి నేను ఎదురెళ్లి మేళతాళాలతో తీసుకురాలేదని చెప్పుతున్నాడు. "వీడేమన్నా మంత్రిగాగాని తాసిల్దారుగాగాని వచ్చాడా చెప్పు మన ఊరు? వీడు చేసే లెక్చరరుగిరీకి ఈ మర్యాద చాలింది కాదని వీడి అఘోరింపు" అంటూనే వీధిలోకి వెళ్లిపోయినాడు.

లక్ష్మ: బాగానే ఉంది నాయనా మీ సరసం. ఏరమ్మా నీపిల్లలు, వీడికెన్నేళ్లు? రా నాయనా. నీ పేరేమిటి?' అని బాబ్జీని వడిలోకి తీసుకుంది.

ర: 'వీడికి పదేళ్లు నిండినాయి పిన్నీ, నాన్నగారి పేరే, రామకృష్ణ. అది దుర్గారాణి దానికి ఐదోయేడు.

లక్ష్మ 'చెల్లెలు సుశీలను తీసుకురాలేదేమమ్మా? దాన్ని కూడ చూచి సంతోషించేవాళ్ళముగా?'

ర: కాలేజీ కిప్పుడు సెలవులు లేవు, పండుగ మూడురోజులు ఇస్తారేమో. దానికి వీలయినప్పుడు నాకు వీలుండదు. ఎప్పటికప్పుడే వద్దామనుకోడం వీలులేకపోవడం. దానికి సెలవువచ్చేదాకా ఉంటే నాకు మళ్లీ అడ్డువస్తుంది."

లక్ష్మ: "ఔనమ్మా, అట్లాగే మరి. పదిరోజులపాటుంటారా?"

గో: "పదిరోజులు కాదత్తా పదివారాలైనా ఉంటుంది మీ పిల్ల, మీరు ఉంచుకుని పురుడుపోస్తే. మూడోపురుడుట ఇది నాసెత్తిమీదకి తోసింది మీ తోటికోడలు." రమణి ఈ మాటలతో బెదిరినట్లయి భర్తముఖంకేసి వాలుగాచూసింది. అతని కనుకొలకులలోని సంజ్ఞ గ్రహించి స్థిమితపడింది.

కాఫీ తెస్తున్న రామేశం భార్య రాజమ్మ ఈమాటలు విని—"ఏం భయమా ఏమిటి? నిక్షేపంగా పోస్తాము. మాటవరసకంటారుగాని నిలుపెత్తుధనం పోస్తేమాత్రం ఉంటారేమిటి? ఈ పల్లెటూళ్ళో డాక్టర్లా! ఆసుపత్రులా? ఇంతకీ తల్లి ఇక్కడకు రారుగదా? ఎంత చేస్తే మాత్రం తల్లితో సాటి అవుతాము?" అన్నది.

రాజమ్మ అనుకూలంగా మాట్లాడుతున్నట్టే ఇక్కడ కుదరదన్నట్టు సమాధానం చెప్పింది. ఆ మాటలవాటం, అనుభవంలేని రమణికి ఆశ్చర్యం కలిగించినది.

ర: వదినా! పిల్లలు కాఫీ త్రాగరు. పాలలో కొంచెం నీళ్ళు కలిపి ఇయ్యి."

ల: "పట్నవాసంవాళ్లు కదా? కాఫీ త్రాగరా! బాగుందమ్మ మంచి అలవాటు చేసేవు. ఇప్పుడు మరీ మీరిపోతున్నారనుకో. పిల్లలు, పెద్దలు అందరికి కాఫీలే! పోనీ అలవాటుంటే ఓమాటు త్రాగడమా నామొహమా? దాహమే సినప్పుడల్లా ఆ నీళ్లేకదా! రామ, రామ. పాడి ఉంటే తప్ప ఊళ్ళో పాలుదొరకడం యజ్ఞమే! అన్ని పాలు హోటేళ్ళకి కంట్రాక్టుకదా!"

గో: 'ఏమత్తా నీకు కాఫీ అలవాటు లేదేమిటి?'

ల: 'ఉందా యేమిటి? నాలుగేళ్ళ క్రితం జబ్బుచేసినప్పుడు ఈ దిక్కుమాలిన కాఫీ అలవాటుచేసేరు కాని, ఏనాడయినా యెరుగుదునా? ఓనల్లమందు దొరకదు కదా! ఏదో ఆకాఫీతోటే ఇల్లా నడుస్తోంది ఘటం. ఈ వయసున శరీరబలమేముంటుంది చెప్పు, ఆహారబలమేకాని? అవునే ఏమిటి తెచ్చావు మీ పట్నం నుంచి. పళ్ళూకాయలూ చిత్రవిచిత్రాలు వుంటాయి టక్కడ?

రా: 'అయ్యో మీ వెఱ్ఱిగాని అత్తా, అక్కడ తోటలా, దొడ్లా! ఏది కొన్నా డబ్బుకు డబ్బెత్తు రాదుకదా! కరువుమండిపోతుంటే ఏం కొంటారు, ఏం తెస్తారు? అదీకాక ఏదో మనకున్నది తృణమో, పణమో మనం పెట్టాలిగాని, వాళ్లు తేవడమేమిటి, మనం పుచ్చుకోడమేమిటి?'

దొడ్లో పనిమనిషికి, పాలేరుకి పన్లుపురమాయిస్తూ ఊపిరి సలుపని పనితో కొట్టుమిట్టాడుతున్నట్టు నటిస్తున్న రాజమ్మవీరి సంభాషణపై ఒక చెవి వేసియున్నది. గోపాలరావుకుగాని, రమణికిగాని సమాధానమిచ్చే అవకాశం లేకుండానే ఆమె జవాబుచెప్పేసరికి రమణి ఆశ్చర్యపోతూంది.

'ఔనమ్మా అట్లాగే మరి. మన దొడ్లో అయితే అర్ధరాత్రయినా, అప

శాస్త్రయినా ఇట్టే కొనుక్కుంటాము. వాడు కుంటాము. డబ్బుపెట్టి కొనడం మాటలా ఏమిటి! పొద్దెక్కింది నే వెడతాను. మధ్యాహ్నం మాయింటికో మారు రామ్మా రమణీ' అని లక్ష్మమ్మ వెళ్లిపోయింది.

లక్ష్మమ్మ అన్నమాటలకు రమణి నిలువునా స్తంభించిపోయింది. ఆ మాటలలోని వ్యంగ్యానికి తానెంతవరకు గురియై యున్నది; నిజమే తనకు తెలియకపోయినను లక్ష్మమ్మకు తాను ఋణపడియే యున్నది. కాని,—తను కొని తెచ్చిన పదిపన్నెండురూపాయల పళ్లు ఉన్న



జాతీయ పోరాటమునందు మనము చూచుచుండగనే నేత పరిశ్రమ స్వయం పోషకమునకు దారి చూపినది. నూరారుకోట్ల రూపాయల పెట్టుబడితో నిర్మింపబడిన యీ పరిశ్రమయందు నేడు సుమారు 450 మిల్లులు పనిచేయుచున్నవి. పనియందు ఆసక్తిగల 70 లక్షల మంది స్త్రీ పురుషులు ఈ మిల్లులలో పనిచేయుచు అపరూపమైన బట్టను తయారు చేయుచున్నారు.

## సామాన్యమానవునకు నేతపరిశ్రమలోని అపరూప సౌందర్యము.

ఇంకను చేయవలసినది యెక్కువ గలదు. ప్రతిమనుజునకును చాలినంత బట్టను, ఎగుమతి చేయుటకు కావలసినంత మిగులు బట్టను తయారుచేయవలెను. మనకు లభించిన వస్తు సముదాయముతోను, కార్మిక వర్గముతోను ఈ పని నెరవేరగలదో లేదో గమనించవలెను. కార్మికులు మానవరూపమున నున్న యంత్రములు. కాబట్టి వీరిని ఆదరించుట సముచితము.

సామాన్యముగా కనుపించే "టీ" దినమునకు రెండు సార్లు రెండు కప్పులు వీరికిచ్చినచో, అది వారికి పనియందుత్సాహమును, పరిశ్రమ తోటి అవినాభావసంబంధమును పెంపొందించ గలదు అనేక మిల ఆర్థిక కేంద్రాలలో యిప్పటికే యిది అనుభవమునందున్నది.



# టీ

పనిచేయువారలకు పనియం దుత్సాహము కలిగించును

సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.

# ★ మీరూ అంతేనా? ★

ట్టుండి ఏ భోషాణంలో విశ్రమించినాయో! అంతర్యామికే తెలియాలి. ఈ అయాచిత ఋణంలో తాను చిక్కుపడవలసి వస్తుందనికాని, అచేతనములు, కాళ్లు వచ్చి పలాయనం చిత్తగిస్తాయని కాని తన కింత వరకు తెలియదు! లేకున్న ముందరే జాగ్రత్తపడివుండేది.

రాజమ్మ: చూడు, అప్పీ. రమణమ్మగారు రాకరాక మన ఊరు వచ్చారు. పట్నవాసంవారాయిరి. ఇట్లా నూతులో ఆమె చేద వెయ్యకుండా ఆమెకి పిల్లలకి కావలసిన నీళ్ళన్నీ తోడియ్యాలి నువ్వు. వేడి నీళ్లు కాచి బట్టలు పిండియ్యాలి. తెలిసిందా? నీ ఋణం ఉంచుకోరులే, పండుగ ఈనామూ, పాతచీర ఇవ్వకుండా వెళ్ళరు రమణమ్మగారు' అప్పి నుద్దేశించి రాజమ్మ అంటున్న మాటలు వినేటప్పటికి వంటినిండా జెట్టులు పాకుతున్నట్టనిపించింది రమణికి.

“దాన్నెందుకు బాధపెట్టడం పాపం ప్రొద్దుటినుంచి చేస్తున్నది, ఇంటికి వెళ్లనీ. మీ మరదలికి బట్టలు రేవు పెట్టుకోడం కుట్టుకోడం కూడా అలవాటే. నీళ్ళంత కంటె బాగా తోడుకుంటుంది. గుంటూర్లో నీళ్ళేతోడగా లేనిది ఇక్కడేం బాధ, బారెడు తాడు” అన్నాడు గోపాలరావు. అన్నదే చాలన్నట్లు అప్పి అవతలకు దాటిపోయింది. రాజమ్మ అతిథిమర్యాదల బాధ్యతంతా తానే వహించడంచేత తీరుబడిలేనట్టు. ‘వెళ్లాలమ్మా వంటెంతవరకయిందో నేను దగ్గర లేకపోతే ఒక్క పని కూడ సవ్యంగా జరగదు. మీ అత్తచేత జడ వేయించుకో రత్నం.' అని కూతురికి ఆజ్ఞాపించింది. నూనె సీసా, దువ్వెన తీసుకుని రత్నం రమణివద్దకు వచ్చి కూర్చున్నది. రమణి జడవిప్పుతూ, “ఏమమ్మా ఇట్లా నీరసంగా ఉన్నావు? ఈమధ్య జబ్బేమయినా చేసిందా?' అన్నది.

రత్నం: జబ్బేమీ లేదుగాని రోజూ కొంచెం జ్వరం తగులుతుంది. ఆకలుంటుంది. అన్నీ తింటాను. మళ్ళీ నీరసం ఏమిటో! ఇట్లా ఉంటోంది ఏడాదినుంచి, కొంచెం దగ్గుకూడా వస్తుంటుంది.

రమ: మరి మందేమయినా తీసుకుంటున్నావా?

రత్నం: నాన్నగారు ఊళ్ళో తాతాచార్లుగారికి చూపించారు. దీనికి తనవద్ద మందులేదన్నారు. పట్నంవెళ్లి పరీక్ష చేయించుకొని మంచి మందు పుచ్చుకోవాలన్నారు. నాన్నగారికి పాపం ఎప్పటికప్పుడే ఊళ్ళో వ్యవహారాలు, కోర్టువెంట తిరగడం, తిరిక లేదు. అమ్మ పోరుతూనే ఉంది. మీఊరు పంపిస్తే చిన్నత్త పరీక్ష చేయించి ఆస్పత్రిలో మందిప్పిస్తుందని అనుకుంటున్నారు. చిన్నత్త డాక్టరు పరీక్షకి చదువుతోందిట కాదూ?”

ఈ మాట వినేటప్పటికి రమణికి తాను భూమిలోకి కృంగిపోతున్నట్లనిపించింది. ఇంతలో గోపాలరావు పిల్చినాడు. ‘ఇదిగో రమణి, ఇటువచ్చి పెట్టె ఒకమాటు తియ్యి.' రమణి గదిలోకి వెళ్లి పెట్టె తీసి ‘ఏంకావా'లన్నది.

గో: ఇందాకా వచ్చిన మీ పిన్ని ఉత్తరం వ్రాయించి మనుమడిని పంపించింది, ఇదిగో చూడు.

రమణి అతని చేతినుండి ఉత్తరం తీసుకు చదివింది.

‘బాబూ! గోపాలం! ఇంట్లో మిక్కిలి ఇబ్బందిగా ఉన్నది ఒక్క ఐదురూపాయలిస్తే బియ్యం తెప్పించుకోవాలి. మా వాసు మంతు డబ్బు పంపగానే ఇచ్చేస్తాను. ఇందాకా అడగడాని కంపర్లోను వీలుకాలేదు' ఇది ఉత్తరం. రమణి మనసు కరిగింది జాలితో-“పాపం ఈ పదిరూపాయలు పంపండి తిరిగి పుచ్చుకు నేదేమిటి ఎంత ఇబ్బందిగా ఉన్నదో.”

గో: చాలు తెలివి! పుచ్చుకోడాని కివి మనవద్ద కెన్నడూ తిరిగిరావు. ఐదు రూపాయల నోటుం చే తీసి ఇటియ్యి.

రమణి డబ్బిచ్చి ఆలోచనలో పడింది. మేము రాకపోతే ఈ డబ్బు పిన్ని ఎవరివద్ద తీసుకునివుండేది? ఈ పూటకి బియ్యం లేకపోతే నిన్ననే యెందుకు ప్రయత్నం చేసుకోలేదు. మేము వచ్చే వరకు వస్తామని తెలియదుగదా? ఎంత బంధువులైనప్పటికి ఈ అడగడం, అప్పు వంకనైనప్పటికీ ఎంత కష్టం?

దరిద్రం మానాభిమానాలను లెక్కచేయనీయదు కాబోలు! కాక యీ మనుష్యుల తత్వమే ఇట్టిదా? అయితే రామేశం అన్నయ్యకూడ ఇంతేనా? తమ్మెంతో ఆదరణతో ఆహ్వానించడానికి అంతరార్థమేమయిన యున్నదా, లేక పినతండ్రి బిడ్డలనే అభిమానమేనా? ఈపదిరోజులీ రోగిష్టి పిల్లను దూరముగా బిడ్డలను కాసుకొను టెట్లు? రమణి తానొక పద్మవ్యూహములో చిక్కుకున్నట్టు బాధపడసాగినది.

* * *

రామేశం ఉన్న యిల్లు చుట్టు వరండాలున్న బంగాళా. ఇంటికి నలుపైపుల దొడ్డి, దొడ్డిలో పశువులసాల, నుయ్యి, అన్నీ లక్షణంగా ఉన్నాయి. ఇల్లంతా మట్టినేల. ఆ యిల్లు రామేశం తాతగారు కట్టించినారు. రామేశం తండ్రులకు ముగ్గురికి ఆ యింట్లో వాటా వున్నప్పటికి, కడసారివాడయిన రామకృష్ణారావు (రమణి తండ్రి) ఇంటికై ఆశపడక, తనది అన్నభూమి అమ్మివేసుకుని ఆ వూరితో సంబంధం వదులుకుని వెళ్ళిపోయినాడు. అయినప్పటికి రామచంద్రయ్య ఇంటిని మూడు వాటాలుగ చేసి, రెండు భాగాలు తన తీసుకుని మూడవభాగం కామరాజుకి ఇచ్చి

నాడు. రామకృష్ణారావు భాగము తాను తీసుకుందుకుగాను తన భూమిలో భూమి ఒక యెకరం తమ్మునికి వ్రాసియిచ్చినాడు. కామరాజు మొదటినుంచి రోగిష్టివాడు. సైరాబడి లేకపోవడం, ఇంట్లో వర్జాలు మాత్రం తగ్గకపోవడం ఈ కారణాలవల్ల ఆస్తి అంతా అప్పులపాలయినది. వేలమయిపోతున్న ఇంటినిమాత్రం రామచంద్రయ్య కొని తానున్నన్నాళ్ళు తమ్ముని సంసారం బయటపడకుండా కాపాడినాడు. కాని రామచంద్రయ్య చనిపోవటంతోటే ఇంట్లో పిల్లిమీద ఎలకమీద పెట్టి ఆడవాళ్ళనే సూటిపోటిమాటలు పడలేక, ఆ వీధికి రెండు ఫర్లాంగుల దూరంలో ఉన్న ఒక నివేశనస్థలంలో తాటాకు ఇల్లు వేసుకుని కామరాజు వెళ్ళిపోయినాడు. కాని వెళ్ళిన మరుసటి ఏడే ఆయన చనిపోయినాడు. రామచంద్రయ్యకు రామేశం, జగన్నాధం అని ఇద్దరు మొగపిల్లలే కలిగినారు. రామచంద్రయ్య ఇక ఏడాదికి గతిస్తాడనగానే జగన్నాధం టైఫాయిడు వచ్చి చనిపోయినాడు. జగన్నాధం భార్య కనకమ్మ, మూడు నెల్ల పిల్లవాడు చంద్రం, రామచంద్రయ్య పాలబడినారు. కాని తల్లి పిల్లల దురదృష్టంవల్ల, రామచంద్రయ్య కూడ మరుసటియేడే స్వర్గస్థుడైనాడు. కనకమ్మకు పుట్టింట వేరే దిక్కెవ్వరు లేకపోవటంతో బావగారు, తోటికోడళ్ళ ఒద్దికలో కాలం వెళ్ళబుచ్చుచున్నది. రామచంద్రయ్య భార్య జగన్నాధానికి పెళ్ళి కాకుండానే పోయినది. కనకమ్మకు అత్తగారి కోడరికము లేకపోయినా, తోటికోడలా కొరత లేకుండ మనసు తీర్చుచున్నది. కామరాజుకి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. ఆడవాండ్రిద్దరు అత్తవారింట్లో సుఖంగానే ఉంటున్నారు. చదువు సంధ్యలు లేని హనుమంతరావు మాత్రం ఇల్లు గడిచే యెత్తులేక తల్లిని, భార్యని, నలుగురు పిల్లలని ఇంటివద్ద విడిచి మిలిటరీలో చేరిపోయినాడు. కాశ్మీరు పటాలంలో ఉన్నాడు. ఏం ఉద్యోగం చేస్తున్నాడో యేమొ నెలకు నూరు రూపాయలు ఇంటికి పంపుతున్నాడు. అవి పది రోజుల్లో మూడు పూవులు ఆరు కాయలుగ వెచ్చించి ఆనక యిల్లు గడవక అత్తాకోడళ్లు అవస్థ పడుతుంటారు.

రత్నాన్ని సాయం తీసుకుని రమణి ఆ పినతండ్రిగారింటికి బయలు దేరినది. సంక్రాంతి రోజులు. పండుగ వారంరోజు లున్నది. ఇంటింట మహాసందడిగ ఉన్నది. ముత్తులు మెత్తుకునేవారు, గోడలకు వెల్లలు వేసి అరుగులకు చుక్కలు పెట్టుకునేవాళ్లు, ఏ యింట్లో చూచినా సంక్రాంతి సన్నాహ చేసుకుంటూ కనిపించినారు. విరియగాచిన మునగ చెట్లు, చక్కగా పూసిన చిక్కుడు పాదులు రమణి చిత్రంగా చూస్తూ వెడుతున్నది. ఆ పల్లెకు వచ్చిన రమణిని ముఖ్యముగా చెప్పులు వేసుకున్నందుకు, చేస్తున్నపని విడిచిపెట్టి స్త్రీలు వీధిలోకి వచ్చి వింతగా చూస్తున్నారు. వారి కాళ్ళనున్న కడి



# విహారా అంతేనా?



గొలుసులు, తోడాలు, అందెలు మొదలయిన వస్తువులు, ఇంచుమించు రెండు వందల తులాలయినా బరువున్న వాటిని చూచి రమణి వారి ఆభరణ ప్రియత్వమునకు విస్మయము చెందినది.

లక్ష్మమ్మ రమణినెంతో ఆదరంగా ఆహ్వానించి కోడలిని పిల్లలని పరిచయం చేసింది. ఇద్దరు ఆడపిల్లలు పెద్దవాళ్లు. పెద్దపిల్లకు పదహారు, రెండవ పిల్లకు పధ్నాలుగు ఏళ్లుంటాయి. తరువాత ఇద్దరు మొగపిల్లవాళ్ళు. పన్నెండు తొమ్మిది ఏళ్లుంటాయి. ఇంట వంట దరిద్రచ్ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ముక్కలు తెగి మురికిపట్టిన నవారుతో నున్న మంచాలు, సొట్టలు పడి కిలుముతో నున్న ఇత్తడిపాత్రలు, ఇంటిలోని మనుష్యుల నిర్లక్ష్యాన్ని సోమరితనాన్ని చాటుతున్నాయి. రమణి పెరటిలోకివచ్చి చూచినది. సుయ్యిచుట్టు చపటా పగిలి కృంగిపోయి, యజమాని అనేవాడుండి హృదయమే ఉన్నట్టయిన దానికి ప్రతిబింబమువలె యున్నది. పెద్ద పెరడు. సంస్కారములేక ఉత్తరేణి, ముళ్లతోట కూర పెరిగి, పురుగుపుట్ర అనేవాటికి చక్కని ఇమ్ముగా నున్నది. ఒక్క నారింజచెట్టు మినహా పనికి వచ్చేదేదీ ఆ దొడ్డిలో లేదు. రమణి అడిగినది. 'ఇంత పెరడు ఇట్లా ఊరికే విడిచిపెట్టేరేం? అరిటి మొక్కలేనా వేయక!'

ల: 'కంచె లేదమ్మా, ఊళ్లో పశువులన్నీ ఇక్కడే. వేయిద్దామన్నా పది, పదిహేను రూపాయలేనా కావాలి.'

ర: 'అన్నయ్య డబ్బు పంపించగానే ముందు కంచె వేయించుకుంటె ఎన్నిపాదులయినా పెట్టి కూరకొనకుండ గడుపుకోవచ్చుగా.

ల: 'సరే నువ్వన్నట్టె చేస్తాము సుకో. మాకేమన్నా పాలేర్లా నౌకర్లా. ఎవరు చేస్తారు చెప్పు మొక్కల సంరక్షణ?'

రమ—'వరే యింకొక రెండుకు పిన్నీ, ఇంట్లో నలుగురు పెద్దవాళ్లున్నారు. రోజు కొగంట పనిచేస్తేచాలు'

పిన్ని కోడలు సమాధానం చెప్పినది. "ఏమోనమ్మా, అయిన యింట్లో పుట్టి, జొన్న యింట్లో పడి ఇంక యీ పనికూడా చెయ్యాలి! మన ఇంటావంటా అటువంటి మోటుపనులు చేసియెరుగం. ఈనాడు తెగించిచేద్దామన్నా నలుగుర్లో నగుబాట్లు-అయినా మీ అన్నయ్యగారు చల్లగా ఉన్నన్నాళ్ళు దేముడి దయవల్ల మాకేమీ లోటులేదు." ఆమె వాక్యాలలోని నిష్ఠురత గ్రహించి రమణి అన్నది. 'నాకు తెలియదు వదినా ఇది అంత తప్పు పని అని! మా ఊళ్లో కొంచెం మట్టినేల కనిపిస్తే చాలు; పూల మొక్కలో కాయపాదులో పెంచుతాము. నే నన్నమాటకు యిబ్బంది పడకు."

ల: "అబ్బే యిబ్బందికేముంది, ఏదో మాటసామెతకంది. ఐనా వాళ్ళతాతగారు రెవెన్యూ ఇనస్పెక్టరు చేసేవారు. ఇంట్లో ఆడవాళ్ళని ఖంటేనా చెయ్యనిచ్చేవారు కాదు. దానికి పని అలవాటు బొత్తిగా లేదు. పిల్లలు పిల్లలే కదా? అత్తవారింటికి వెడితే వాళ్లకెలానూ తప్పదు. నేను సరే సరి ముసిలిదాన్ని. ఏం పన్లు చెయ్య

గలం చెప్పు? రామ్మా లోపలికిరా కొంచెం ఫలహారం చేద్దురు గాని—

రత్నానికి రమణికి పీటలు వేసి పిన్ని కోడలు ఫలహారముల పళ్లెము లందించినది. పళ్లెములలోని అల్పాహారముల పరిమాణము, వైవిధ్యము పిన్ని కోడలి 'లోటు లేని' తనాన్ని, వెల్లడి చేస్తున్నాయి. ఆ పెట్టిన అవడలు, మైసూర్ పాక్ తన కుక్షిగోళమే కనుక ప్రవేశిస్తే ఆహారేచ్ఛ యన్నది మాయమై పదిరోజు లుపవాసము చేయవచ్చు. అల్పాహారమనే యీ పదార్థములు అతికాయ మహాకాయులైనా భరించగలరాయని రమణి సందేహపడినది. కాని వారగా రత్నం వేపు చూసేసరికి రమణి ఆశ్చర్యము చరమసీమనందుకున్నది. ఈ పదహారేండ్ల అర్భకపు పిల్ల పళ్లెములోని పదార్థములు ఒకటి తరువాత వొకటి అంతర్ధానమయిపోవుచున్నవి!

రమ: ఇంత వద్దు వదినా కొంచెము తీసి పిల్లలకు పెట్టు.

"ఎంత ఉన్నదమ్మా; ఈమాత్రానికే. పిల్లలు తిన్నారు. నా చేతులు చిన్నవి కావమ్మ. కొంచెం చెయ్యడం, కొంచెం పెట్టటం, అదేమిటో కూడా మా యింటా వంటా యెరగము." పిన్ని కోడలు తన 'ఐనింటి తనాన్ని' పునరుద్ఘాటించినది.

రమ: ఇవాళ్ళ యివన్నీ చేసే రెందుకు పిల్ల లెవరికయిన పుట్టినరోజా?

లక్ష్మ: పిల్లలు అత్తయ్య వస్తుంది చెయ్యమని వేధించారు. కోడలికి చేతకాని పిండి వంట లేదనుకో! ఎట్లా ఉంది మైసూర్ పాక్? ముసలమ్మ గర్వపడుతూ అంది.

ర: చాలా బాగా ఉంది. దివ్యంగా చేసేవు వదినా!

ఈ మాటలతో పిన్ని కోడలు పొంగిపోయింది, 'అందరూ అలానే అంటారు. కాని, నాకు గులాబ్ జామ్ బాగా కుదరలేదు సుమా ఎన్నిమాట్లు చేసినా, పాలు సరైనవి లేకనో యేమో? ఎల్లుండి రెండో వాడి పుట్టినరోజు. నీవు నేర్పుతానంటె పాలు తెప్పించి ఆ వేళ చేస్తాను.

"వదినా, నాకీ వంట లేవీ చేతకావు నేర్చుకోడానికి ప్రయత్నం కూడా యెప్పుడు చెయ్యలేదు." అన్నది రమణి.

'ఆఁ! నిజమే., కాని నాకు చిన్నప్పటి నుంచి ఎంతో సరదా' అంటూ పిన్ని కోడలు తనేయే రకాల భక్ష్యాలు చెయ్యగలదో అవి తానెట్లా నేర్చుకున్నదో, తన పాకకళానైపుణి కెవరెవ రెట్లా అభినందించారో ఆ వివరాలన్నీ అనర్గళంగా, ఎంతో ఉత్సాహంగా చెప్పుకుపోతున్నది. రమణి ఊహించుచున్నది. వచనాత్మకమైన యీ నైపుణ్యము, ఉత్సాహము, పదార్థ సృజనాత్మకమే కనుక ఐతే! అసంభవము. 'తివిరి యిసుమున తైలంబు దీయవచ్చు,' బ్రహ్మదిగివచ్చినా లాభము లేదు. రమణి నోటిలో పడిన పదార్థాలు ఇనపగుళ్ళవలె గొంతుగొట్టము దిగుట లేదు. చేతులు కడిగి కొని రమణి యీవల పడినది. ఇంతలో బాబ్జీని రాణీని తీసుకు గోపాలరావు వచ్చాడు.

గో: రమణీ. మీ అన్నయ్య ఏదో ఊరికి పోతున్నాడు. ఐదారు రోజులదాక రాడుట. ఇంటికి వెడదాము రండి అతను నీతో చెప్పటకని కూర్చున్నాడు.

లక్ష్మ: వెడుదురు గాని లెండి తొందరేమిటి అబ్బాయిని బడిలో వేసేరా.

గో: లేదత్తా ఇంక వెయ్యాలి ఇంట్లో నే వాళ్ళమ్మా నేనో చెపుతున్నాము.

లక్ష్మ: మావాడు చూశావా? ఈ ఊళ్లో చదువేమొ అయిపోయింది. ఎంత చదివినా జీతం అక్కర్లేదుగదా వాళ్ళ తండ్రి ఉద్యోగం ధర్మమా అని. (కొంచె మాగి మరల అంటుంది) వాళ్ళ మేనత్తలయినా బస్తీలో లేరు. ఉంటే నెత్తిమీద పెట్టుకు చదివించేవారే.

—ఆమె ఉపోద్ఘాతంలోని భావము పసికట్టిన గోపాలరావు 'అలాగే మరి' అని ముక్తసరిగా అన్నాడు. లక్ష్మమ్మ మరల అందుకున్నది.

'మీ యింట్లో పెట్టడానికి నీవు కాని రమణి కాని పరాయివాళ్ళా మాకు, మేనత్తలకంటె కూడ ఎక్కువది కాని రమణి మరోలాటిది కాదు. వాడికదేం చెయ్యాలి. వాడే యింకా కొత్త చేదోడుగా ఉంటాడు. అయినా ఆ మనిషి కామనిషి బరువని కోడలు నేను ఆలోచిస్తున్నాము,' అని రమణి నుద్దేశించి ఏమంటావు? అని సాభిప్రాయముగా అంది. లక్ష్మమ్మ వాక్యం ముగించేసరికి రమణికి స్పృహ తప్పినంత పని అయినది. తన యావచ్ఛక్తిని వినియోగించి కూడ తానీ ముసలమ్మకు తగిన సమాధాన మీయలేదు. తన ఇంటర్మీడియేటు జ్ఞాన మిక్కడ కానికి కూడ కొరగాలేదు. కాని ఈ సందిగ్ధావస్థలో తానెంత వరకో ఉండ నవసరంలేకపోయినది. గోపాలరావు జవాబిచ్చినాడు.

"అదీ ఆలోచించవలసిందే. ఇంతకీ మీకేంలోటమ్మా ఈ పల్లెటూళ్ళో ఉండడమేం ఖర్మంమీకు? రెండోవాడికి కూడ ఈవూరి చదువైపోతోంది. బస్తీలో కాపురం పెట్టుకుంటె అందరు ఒక్కచోట ఉండొచ్చు. చూడు పిల్లలు బెంగకూడ పెట్టుకోరు.' ఈ ఆఖరివాక్యం ఎంతో లాలనగా అన్నాడు. రమణి కృతజ్ఞతతో

> రైలు నడుస్తోంది. ఆ రైలులో ఒక రెండో తరగతి పెట్టె. ఆ పెట్టెలో యిద్దరే ప్రయాణీకులు.
>
> "రావు సాహెబ్ జగ్గారావుగారు తమరేనా?" అని అడిగాడు ఒక ప్రయాణీకుడు రెండో ప్రయాణీకుడ్ని.
>
> "కాదు. ఎందుకు?"
>
> "ఆ మరేం లేదు. మీరు తొడుక్కొంటున్న ఆ కోటు రావు సాహెబ్ జగ్గారావు రావుగారిది. ఆ రావు సాహెబ్ జగ్గారావు గారిని నేనే." అన్నాడు మొదటి ప్రయాణీకుడు.

భర్తవేపు చూసింది. అతను ముక్కుపుటా లెగురవేసి రమణినిసన్నగా వెక్కిరించాడు.

రమణికి అక్కడ ముళ్ళమీ దున్నట్టున్నది. కాళ్ళకు చెప్పులు వేసుకుని వెళ్ళడానికి సిద్ధపడింది. పిన్ని పెద్ద మనుమరాలు ఎంతో ఆసక్తితో అడుగింది 'జో డెంతకు కొన్నావత్తా?'

రమ: ఐదురూపాయలు.

'అంతేనా? ఈమాటు నెల్లో ఇద్దరి పిల్లలకి కొనాలి ఎన్నాళ్లనుంచో సరదా పడుతున్నారు.' పిన్ని కోడలు ఎంతో వాత్సల్యంతో అనేసరికి రమణి కోపముతో దహించుకుపోయింది. తల్లి కర్తవ్యము బిడ్డల ముద్దుముచ్చటలు తీర్చుటతో సరేనా. వారి పురోభివృద్ధికి దోహదమిచ్చే బాధ్యత తనకు లేదా?

ర: ఇక వెడతాం పిన్ని, సెలవు వదినా.

లక్ష్మ: ఇదిగో చూడమ్మా రమణీ, మా యింట్లోకూడ రెండురోజు లుంటేగాని వీల్లేదు. నువ్వు గనుక రాకపోయావంటే ఎంతేనా ఇబ్బంది పడతానుకో?

రమణి కేమిచెప్పాలో తెలియలేదు. పిన్ని యొక్క యీఅపూర్వ వాత్సల్యానికిగాను, ఆమె పడేయిబ్బందికిగాను ప్రొద్దున ఇచ్చిన ముడుపున కథమం రెట్టింపయినా సమర్పించుకోవలసి యుంటుంది. కాని ఈసారి

# వీరూ అంతేనా?

కూడ గోపాలరావే సమాధాన మిచ్చినాడు. 'ఈమాటుకి మమ్మల్ని క్షమించత్తా. ఈసమయంలో నీ అభిమానమంతా యీవిడమీద చూపించావంటే ఆనక నే నాస్పత్రివెంట తిరగలేను. నీచెయ్యి, నీ పెట్టు ఇంతిప్పటినుంచి నే నెరుగుదును. మళ్లీ వచ్చినప్పుడు నువ్వు 'వెళ్లు' అనేదాకా వెళ్ళము చూసుకో," నవ్వుతూ అన్నాడు. అతని వాక్యాలలోని ప్రశంసకు చిరునవ్వు నవ్వుతూ లక్ష్మమ్మవారిని వీధివరకు సాగనంపినది. గోపాలరావు డడడా, డడడా, అంటూ కూనిరాగం ఆలాపిస్తూ దారితీశాడు. రమణి లోకజ్ఞాన శూన్యతను పరిహసించే సాంకేతిక మది.

కాని రమణి అదేమి లక్షించలేదు. అనేక ఆలోచనల సంఘర్షణవల్ల ఆమె తల ఉడుకెత్తిపోవుచున్నది. పిన్ని అమాయిక లౌకికజ్ఞానము పిన్నికోడలిలో లేని సంతృప్త జీవనము సహస్రముఖములు దాల్చి కళ్లయెదుట వికృతనాట్యము చేయుచు రమణికి మార్గము కనుపించనీయలేదు.

* * *

గోపాలరావీ వూరు వచ్చుటకు ముఖ్యమైన కారణము వేరెయున్నది. రామచంద్రయ్య ఇంటికోడకు ముదరాగా యిచ్చిన తన మామగారి భూమిని అమ్మివేయవలెను: రామచంద్రయ్య చనిపోయిన తరువాత దానిమీది శిస్తు దమ్మిడీకూడ రమణి తల్లికి చేరలేదు. రామేశంవద్ద ఆ డబ్బు రాబట్టగల సమర్థత లేదు. అమ్మకము నవకు పెట్టిన తగిన ధర రానిస్తాడనే నమ్మకమంతకంటె లేదు. తన భూమిలోని భాగము మరియొకనికి దక్కనిచ్చే అంతటి అసమర్థుడా రామేశం! ఇక్కడి పరిస్థితులను స్వయంగా అవగాహన చేసుకుని ఎట్లా వీలయితే అట్లా వ్యవహారం పరిష్కారం చేసుకోవాలి. అతనే ఊరువచ్చేనాడే బండిలో రామయ్య తాతను భోగట్టా చేసి కనుక్కున్నాడు. రామయ్య తాతంటే నమ్మిన బంటు.

ఊళ్ళో సోమయాజులుగారి మధ్య కొడుక్కి పెళ్ళిచేసి పదివేలు కట్నం తీసుకున్నాడు. ఖర్చయినది ఖర్చవగా మిగిలిన డబ్బుతో ఉన్న ఊళ్ళో ప్రశస్తమైన భూమి కొనదల్చుకున్నారుట. ప్రస్తుతం అమ్మబోయె భూమికర ఎకరం మూడువేలకి పైనయున్నదిట. ఈ వివరాలు రామయ్య వలన తెలిసినవి. రామేశం ఊరికి పోవటం గోపాలరావుకి రొట్టె విరిగి నేతిలో పడినట్టే అయినది. కాని రామేశంకొడుకు శంకరం అతని ప్రాణానికి సి. ఐ. డి లా తగులుకున్నాడు. ఈడుకి పద్నాలుగేళ్ళే అయినా, అక్షరజ్ఞానం పూజ్యమైనా, లౌకిక జ్ఞానానికి మాత్రం అఖండుడు. ఏమైతే కానిమ్మని సోమయాజులు గారింటికి శంకరంతోనే బయలుదేరి వెళ్ళినాడు గోపాలరావు.

'నమస్కారం యాజులుగారూ.'

సో: 'శతాయుష్మాన్ భవ, ఎప్పుడొచ్చావు నాయనా? చాల నాళ్లకు కనిపించావురా, ఇలారా, కూర్చో కులాసాగా ఉంటున్నారా. గుంటూర్లోనే ఉంటున్నారా?"

గో: 'ఆ. గుంటూర్లోనే, సెలవులకు, మద్రాసు వెళ్ళి ఇలా వచ్చాము.

సో: 'ఏమిటీ! కుటుంబంతో కూడానే వచ్చావా??

గో: 'ఆ కుటుంబంతోనే వచ్చాను. ఎంతకాదన్న రక్తస్పర్శ మాడండి. అన్నగారు పదే పదే పలవటంతో పరిగెత్తుకు చక్కావచ్చింది అందర్నీ చూద్దామని.'

సో: 'బాగుంది నాయనా చాలా సంతోషం.'

గో: అబ్బాయికి పెళ్ళయిందటే! అమ్మాయికి కాకుండ ముందు అబ్బాయికి చేసేశారేం?'

సో: 'ఏంచెయ్యను నాయనా ఆడపిల్లలకు సంబంధం కుదరడం యజ్ఞమనుకో. ఒకటుంటే ఒకటి ఉండదు. ఐన సంబంధం దొరకలేక అబ్బాయికి ముందు కానిచ్చేను. కొత్త చదువుకుంటున్న కుర్రవానికి ఇయ్యవలెనని యున్నది. నీ యెరుక నేమయిన సంబంధం ఉంటే చెప్పు నాయనా.'

గో: అంతకంటేనా! కాలేజీలో నా

## మగవారంతా అంతే!

ఒకసారి మా అమ్మాయికి సుస్తీచేసింది. పది రోజుల పాటు పగలూ రాత్రీ దానికి చాకిరిచేసి అలసి పోయాను. ఆరోజున మా ఆయన యింటికి వచ్చాక నిర్మొగమాటంగా చెప్పేశాను - ఈవేళ రాత్రి అమ్మాయికి ఏది కావలసి వచ్చినా చూడవలసిన బాధ్యత తన దేననీ, యీ పదిరోజుల చాకిరీతో నేను అలసిపోయి వున్నాననీ.

ఆ రాత్రి రెండో ఝాము వేళ నాకెందుకో మెళుకువ వచ్చింది. కళ్లు తెరిచి చూతును కదా,- అమ్మాయి హీన స్వరంతో "మంచి నీళ్లు కావాలే అమ్మా!" అని అతి దీనంగా అడుగుతోంది. నాకు వొళ్లు మండుకువచ్చింది. జ్వరపడివున్న పిల్ల ఎంత సేపటినుంచి అరుస్తోందో ఏమో? ఈ పెద్దమనిషి గురకలు పెట్టి ఎలా నిద్రపోగలుగుతున్నారని విస్తుపోయాను.

ఆయన పడుకొన్న మంచం దగ్గిరకు వెళ్ళి ఆయనను తట్టి నిద్రలేపి, అమ్మాయి మంచి నీళ్లు అడుగుతోందని చెప్పాను.

నిద్ర లేపగానే ఆయన వులిక్కిపడి లేచి దుప్పటి విసిరేసి, సరాసరి వంటింట్లోకి పోయి గ్లాసు వెతికి తెచ్చుకొని, ఆగ్లాసు నిండా కొళాయి నీళ్లు పట్టి అవి కాస్తా తన గొంతుకలో పోసుకొని మాట్లాడకుండా వచ్చి తన మంచం మీద పడుకొని దుప్పటి నిగడదన్ని వెనుకటి శ్రుతిలో మళ్లీ గురక ఆరంభించేశారు!

# ★ విూరూ అంతేనా? ★

చున్నది. ఎవరి కెట్లు వడ్డించవలెనో కన కమ్మకేమి తెలుసు!

రామేశం: విూరున్న నాలుగు రోజులింటిదగ్గర ఉండడానికే నాకు కుదిరింది కాదు. రమణినుద్దేశించి అన్నాడురామేశం.

రమ: ఏం చేస్తావు చెప్పు నీవుమాత్రం. పన్లుంటే తప్పుతుందా?

గో: మహా చేసేదుతే పనులు. ఇదిగో బావా, చూడు నే నొక్కమాట డుగుతాను. ఆ పిల్ల రత్నం అట్లా ఎందుకుపోతుంటే దాని సంగతిగాని ఇంటి సంగతిగాని ఏమైనా కొంచెం పట్టించుకోవాలా, అక్కర్లేదా?

రా: ఏం చెయ్యమురా గోపీ, ఎప్పుడో తీరుబాటు చేసుకు పట్నం తీసుకువెళ్లాలి. దాన్ని చూస్తే నాకూ బెంగగానే ఉన్నది.

గో: 'ఇంకా నెమ్మదిగా ఎప్పుడో అంటున్నావా! రేపుమాతో పంపు. దాని సంగతి నేను చూస్తాను. ఆలశ్యం చేస్తే పిల్ల ఎందుకయినా పనికి వస్తుందా? గోళ్లతో పోయేది గొడ్డళ్లు పట్ట వలసి వస్తుంది.' రామేశం ఆలోచిస్తూ భోజనం ముగించాడు. అందరూ చేతులు కడుగకుని సావిట్లోకి వచ్చారు.

గో: బావా నువ్వెందుకాలోచిస్తున్నావో నాకు తెలుసు. మన సుశీలకాస్పత్రిలో అందరూ పరిచయమే, నీవుగానీ, నేనుగాని అక్కడికి వెళ్ళి వుండనక్కరలేదు. సుశీ పరాయిదా? మా పిన్నికూడ పిల్లను వెయ్యికళ్ళతో చూస్తుంది. వాళ్లింటికి పిల్లను పంపడానికి నువ్వు సందేహిస్తే యెట్లా?

రామేశం చుట్టపొగవదుల్తూ విన్నాడు.

గో: నీకు ఆస్పత్రిలో దమ్మిడీ ఖర్చు అవకుండా సుశీ జాగ్రత్త పడుతుంది. సుశీ రెండేళ్లలో డాక్టరైపోతుంది. మన కందరికి ఎంత సహాయమనుకున్నావు? అన్నట్టు, దాని చదువుకింకా రెండు మూడు వేల దాకా ఖర్చవుతుందిట. మా పిన్ని నీతో చెప్పి వాళ్లభూమి అమ్మించి పెట్టమన్నది.

రామేశం ఆలోచనలో పడినాడు. గోపాలరావు మరల అందుకున్నాడు. 'మేమూరాగానే నీవు వూరికివెళ్ళేవు నీతో చెప్పడానికి సావకాశం లేకపోయింది. ఈ లోగా ఊరికే కూర్చోడ మెందుకని ఊళ్లో ప్రయత్నం చేసాను, ఎవరయినా కొనే వాళ్లున్నారా అని, మన సోమయాజులుగారు మూడు వేలయితే కొంటానన్నారు. అలాయిస్తే మనకు నష్టమంటావా?'

ముందరికాళ్లకు బందము వేస్తూ మాట్లాడుతున్న గోపాలరావుకి చప్పున సమాధానమీయలేక గుక్కిళ్లు మ్రింగాడు రామేశం. కోపం ముంచుకువచ్చుచున్నది. కాని చిక్కిశల్యావశిష్టయైన రత్నంస్థితి, తన కున్న పనుల వత్తిడి, సుశీలవల్ల తాను పొందవలసిన సహాయం యివికోపమును మ్రింగునట్లు చేసినవి. అతనన్నాడు.

'ఏమీ నష్టంలేదు. కాగితాలు అవి సిద్ధం చేసుకునే వచ్చావేమిటి?'

గో: 'అన్నీ సిద్ధమైఉన్నాయి. అగ్రిమెంటుమీద నీవు సాక్షి సంతకం చెయ్యడమే తరవాయి.'

రా: 'సరే మీరు పండుగనాడే వెళ్లాలా?'

గో: 'కనుమునాడే కాలేజీ మరి.'

పండుగ నాడందరికి కొత్తబట్టలు ఇచ్చాడు రామేశం. రత్నాన్ని పంపడానికి నిశ్చయం చేసుకున్నారు తలిదండ్రులు. కాని భోజనానికి వచ్చిన సోమయాజులు పిల్ల నక్షత్రాని కానాడు మంచిది కాదనియు, విపత్తారలో వైద్యానికని సుతరామూ వెళ్ళకూడదనియు చెప్పినాడు. గోపాల్రావెంతో నిరుత్సాహం కనబరుస్తూ అన్నాడు. 'బావా మరి నువ్వు శ్రద్ధచేయక, మంచిరోజు చూసుకొని రత్నాన్ని తీసుకురావాలి. మాఊరునుంచి మెడ్రాసుతీసి కెళ్లి చూపించే భారం నాది.

రా: 'తప్పకుండ తీసుకువస్తాను.'

గో: 'రత్నం కూడా వస్తుందని పిల్లలెంతో ఉత్సాహపడ్డారు. పోనీ చంద్రాన్నైనా మాతో పంపు తీసుకు వెడతాము.'

రా: వాడు బెంగపెట్టుకుంటాడు తల్లికోసం. ఇప్పుడెందుకు?

గో: బెంగపెట్టుకోడు కుఱ్ఱాళ్ళతో స్నేహం కలిసింది. అంతగా బెంగపెట్టుకుంటే నువ్వొచ్చినప్పుడు నీతో పంపేస్తాను.

రా: వాళ్ళమ్మ పంపితే తీసుకువెళ్లు.

* * *

బండి మందకొడిగా నడుస్తున్నది. గోపాలరావు ఉషారుగా కూనిరాగాలు తీస్తున్నాడు. చంద్రం ఉత్సాహంగా ఏవో కబుర్లు చెపుతుంటే బాబ్జీ, రాణీ పకపక నవ్వుతున్నారు. రమణి మౌనముద్ర ధరించి ఆలోచనా నిమగ్నయైయున్నది. ఈ పది రోజులు తనకు నిజముగ మరపుకురాని రోజులే! వ్యక్తుల శక్తియుక్తులు, ముఖ్యముగ స్త్రీలవి, మనస్సుతో కూడ ఎంత పాతాళమునకు దిగజారినవో తను ప్రత్యక్షముగ చూచినది! విద్యయేయున్న, ఈ యజ్ఞానము, అకర్మణ్యత్వము ఇంతగ విజృంభింతునా? దాలిగుంటనుండి దాగర కొలిమిని పడినట్లయినది. తా నాశించిన దేమి? చూచినదేమి? ఆమె దీర్ఘనిశ్వాసము విడచినది. గోపాలరావీ మౌనమును సహించ

మనిషి పాటకీ, రేడియో పాటకీ గల వ్యత్యాసాన్ని గూర్చి మాలో మాకొకసారి విపరీతమైన వాగ్వాదం చెలరేగింది. ఈ తర్జన భర్జనలన్నీ మొదటి నుంచీ విని విని, విసిగెత్తిపోయి, మనిషి పాటకంటే రేడియో పాటే మేలు అంటాను. ఏమంటారా. రేడియో పాట అయితే అది వినబడకుండా చేసుకొనే సాధనం మన చేతులోనే వుంది." అన్నాను.

లేక పోయినాడు. 'ఏయి, ఇటు చూడు, ఎవరికోసం ఆ విలాపం ?'

"మీరు చూచినది కూడ పట్టించు కోరు. మీ మనసు రాయి. యింత కఠిను లెక్కడ ఉండరు." రమణి కోపముగా అన్నది.

గో : ధన్యోస్మి! తమరు ప్రసాదించిన బిరుదు శిరసావహించుచున్నాను. కాని, ఈ దాస పరమాణు వేమి చేయవలెనని, తమరి యాజ్ఞ ?

అతని ధోరణికి ఆమెకు నవ్వు వచ్చినది. ఇలా అన్నది—'పరిహాసము కాదు మీ బోధనా సామర్థ్యము నీ పల్లెటూళ్ళలో ఎందుకు వినియోగించరని?'

గో : దేశవ్యాప్తమైన సమస్య ఒక్కని వల్ల తీరదు. దానికి ప్రభుత్వము పూనుకో వాలి. నావంటివా డెక్కడైనా పూను తున్నా, మీ అన్నలాటివాళ్లు బలవంతముగ పార్టీకక్షులలో కీడ్చి, గాడిదను చేస్తారు. తరువాత 'ఉభయ భ్రష్టత్వము ఉపరి సన్యాసమూను.'

రమణి నిట్టూర్పు విడచింది.—'రామేశం అన్నయ్య తీరిక లేక తిరుగుతు ఏదో వ్యగ్రతలో ఉన్నాడు. ఎందుకో మీకు తెలుసా?

గో : తెలియకేం ఊళ్ళో పార్టీలు, ఎలక్షన్లలో బుఱ్ఱలు బద్దలుకొట్టుకుని కోర్టు కెక్కారు. అందులో అతనుకూడ భాగస్వామి ఇదే అతనికి విశ్రాంతి లేకపోవటానికి కారణం.

ర : ఈ కుఱ్ఱకుంకని వెంట తీసుకు వచ్చినా రెందుకని ?

గో : ఎందుకేమిటి. బాబ్జీతో స్కూల్లో చేర్చటానికి.

ర : ఈ ప్రత్యేక వాత్సల్యానికి కారణం తెలుసుకోవచ్చునా ?

గో : నిరభ్యంతరంగా. వీడిని తీసుకు వచ్చుటకు ఒకటికాదు రెండు కారణా లున్నవి. ఒకటి—'జగన్నాథం వీడిని నా కప్పగించి చనిపోయినాడు. వాడు మేనమామ కొడుకే గాదు, నాకు ప్రాణ స్నేహితుడు. నేను మీ ఊరువచ్చి అనర్సు చదవడంగాని, తరువాత నిన్ను చేసికోడం గాని వాని ప్రోద్బలంవల్ల నే. ఆఁ మా సంగతి తెలిసినది కనుక నే కనకమ్మ పిల్లవానిని మనతో సంతోషముగ పంపినది.

ర : రెండవ కారణము ?

గో : రెండవ కారణమా ? మరీ. దేముడు మేలుచేస్తే—

ర : ఊఁ. మేలుచేస్తే ?

గో : "మరీ దేముడు మేలుచేస్తే,"అంటూ జంటగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న రాణీ, చంద్రులవంక సాభిప్రాయంగా చూశాడు. రమణి అటు చూసింది. మెఱుపువలె తట్టిన యూహను స్థిరపర్చుకో లేక ఆశ్చర్యంతో అంది.

'ఏమిటి ?'

గో : కోమటి 'తను కార్యంబు ఘటించుచుఁ పరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్.'

ర : మీరూ అంతేనా ?

గో : ఆఁ. నేనూ అంతే.





# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 92. భూమీ, గ్రహాలూ ఎలాగు ఉద్భవించాయీ?

అని జంషెడ్‌పురంనుంచి ము-రా-రా గారు అడుగుతున్నారు.

భూమీ గ్రహాలూ సూర్యుడినుంచే ఉద్భవించాయని వైజ్ఞానికులు ఊహించారు. సూర్యుడుజ్వలించిపోతూన్న వాయు గోళము. ఇంతమాత్రమే కాదు. తన చుట్టూ తాను తిరుగుతూన్న గోళముకూడాను. గ్రహాలేవీ లేని తొలియుగాల్లో సూర్యుడు తన చుటూ తాను తిరుగుతూండగా సూర్యుడి చేరువనుంచి పెద్దనక్షత్ర మొకటి దూసుకుపోయిందట. "జగత్తులో ఏవస్తువైనా సరే చేరువనున్న వస్తువుని ఆకర్షిస్తుంద"నే గురుత్వాకర్షణ సూత్రము ననుసరించి, ఆ నక్షత్రము సూర్యుడిలో ఉన్న వాయుమండలాన్ని ఆకర్షించి వుండాలి కదా? ఈ ఆకర్షణాకిలోబడి సూర్యగోళ వాయువులు ఆ నక్షత్రము వేపు మొగ్గినవట.

పటములో ఆగంతుక నక్షత్రము, 1 2, 3, 4 చోట్ల ఉండినప్పుడు సూర్యమండల వాయువులు— పోటుసమయంలోని సముద్రజలము వలె లేచి దానివైపు ఏరీతిగా పొడిచినవో చూపబడినది. నక్షత్రములాగినకొద్దీదూరమై ఆ నక్షత్రము దూరము కాగానే గుంపులు గుంపులుగా చేరి, క్రమముగా చల్లారి బుధ, శుక్ర, భూమి, అంగారక, గురు, శని, వరుణ ఇంద్రగ్రహములైనవి. అంగారకునికీ గురునికీ నడుమ అనేక ఉపగ్రహాలున్నాయి ఒకగుంపుగా. చివ్వరిది ప్లూటో అనే గ్రహము.

సూర్యుడు తనచుట్టూ తాను తిరుగుతున్నాడన్నాము. ఆ తిరుగుడు వాయువులకీ అంటి ఉండును కనుక ఈ వాయువులు చల్లారి ఏర్పడ్డ ఘనపదార్థాలు— గ్రహాలు — కికూడా తనుచుట్టూ తాను తిరిగే గుణము సంక్రమించింది. గ్రహాలన్నీ తనుచుట్టూ తాము తిరుగుతున్నాయి

చంద్రుడు, భూమినించి, భూమి తిరగడమువల్ల ఊడిపోయి దూరముగా పోయిన ఉపగ్రహము. ఇగేలా తక్కిన పెద్ద గ్రహాలకీ ఉపగ్రహాలున్నాయి.

—రావు




## 93. నూతన నక్షత్రాలు అంటె?

సాధారణంగా నక్షత్రాలన్నీ సమాన దీప్తితో ప్రకాశిస్తుంటాయి సిఫెయి తారలవంటి కొన్ని నక్షత్రాల దీప్తిలో హెచ్చుతగ్గులు కలుగుతూన్నా ఆ హెచ్చుతగ్గులు ఒక నియమాన్ని అనుసరించే ఉంటాయి. అవి కనిష్ఠ, గరిష్ఠ దీప్తులను పొందడానికిగల మధ్యవ్యవధి అంత ఎక్కువగా ఉండదు, కొన్ని రోజులలో, కొన్ని నెలలో ఉంటుంది. వాటి కనిష్ఠ గరిష్ఠ దీప్తి మత్వాలమధ్య ఎక్కువ వ్యత్యాసమే ఉన్నా విపరీతంగామాత్రం ఉండదు. కాని కొన్ని నక్షత్రాలు వట్టి కంటికిగాని, సామాన్య దూరదర్శినికిగాని కనపడనంతటి తక్కువ దీప్తిని ఆదిలో కలిగియుండి, అకస్మాత్తుగా ఒక్కసారి ప్రకోపించి, మహోజ్జ్వల దీప్తితో కొంతకాలం ప్రకాశించి, ఆ తరువాత క్రమంగా అదీప్తిని కోల్పోయి అదృశ్యమౌతాయి. తిరిగి యీ నక్షత్రాలు ఎప్పుడు మహోజ్జ్వల దీప్తితో ప్రకాశిస్తాయో ఎవరూ చెప్పలేరు. ఇవే నూతన నక్షత్రాలు. 'నోవా'లని సామాన్యంగా వీటిని వ్యవహరిస్తారు.

ఆకాశంలో క్రొత్తగా ఒక నక్షత్రం కనపడితే, అది రానున్న మహోపద్రవానికి సూచనయని ప్రజలు 1౬, 1౭ శతాబ్దాలలో కూడా భయపడుతూండేవారు. కాని ఖగోళశాస్త్ర పరిజ్ఞానం బాగా పెంపొందినప్పటినుంచీ ఆ భయానికి ఏమీ ఆస్కారం లేదని శాస్త్రజ్ఞులు తెలిసికొన్నారు. గత 3, 4 శతాబ్దాలనుంచీ శాస్త్రజ్ఞులు అనేక నూతన నక్షత్రాలను అవేక్షించేరు. ఈ శతాబ్దంలో ఇంతవరకు ఎక్కువ గరిష్ఠ దీప్తిని పొందిన నోవాలను అయిదింటిని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు; తక్కువ గరిష్ఠ దీప్తితో ప్రకాశించినవి ఇంకా కొన్ని ఉన్నాయి. ఈ శతాబ్దంలో అవేక్షితమైన నోలవాలోఎక్కువప్రాముఖ్యమైనది నోవా హెర్క్యులస్. ఆకాశంలో హెర్క్యులస్ నక్షత్రరాశి ఉన్నచోట ప్రెన్టైస్ అనే ఆంగ్ల శాస్త్రజ్ఞుడు 1934 వ సంవత్సర ప్రారంభంలో దీనిని కనుగొన్నాడు. ఈ నక్షత్రం ఆదిలో కంటికి కనిపించేదికాదు; ఒక మోస్తరు దూరదర్శినితో చూచినా కూడా కనపడనంత తక్కువ దీప్తితో అ

ఉండేది. ఆతరువాత అకస్మాత్తుగా అది సప్తర్షి మండలంలోని నక్షత్రాల దీప్తియంత అధికదీప్తిని పొంది ప్రకాశించడం ఆరంభించింది. అంటే ఆ కొద్ది గోజులలోనే దాని దీప్తి సుమారు 160,000 రెట్లు అధికమైంది. ఆతరువాత మరి కొంతకాలానికి తిరిగి ఆ నక్షత్రదీప్తి క్షీణింపగా, అది అదృశ్యమైంది.

నోవా నక్షత్రాలదీప్తి యీ విధంగా ఆకస్మికంగా వృద్ధి చెందడానికి కారణ మేమిటో శాస్త్రజ్ఞుల కింకా సరిగా తెలియదు. నోవా నక్షత్రాలను ఆవరించి మసకగానున్న పొర యొకటి ఉంటుంది. ఆ పొరకు అడుగుననున్న పొరలలోని ద్రవ్యం హఠాత్తుగా ప్రేలి బ్రహ్మాండమైన శక్తి విడుదల కావడంవల్ల స్వల్ప కాలంలోనే నోవా అధికదీప్తిని పొంది ప్రకాశిస్తుందనీ, ఆ శక్తి ప్రదేశంలోకి విక్షిప్తమై పోయిన పిమ్మట ఆ నక్షత్రం తన దీప్తిని గోల్పోయి అదృశ్యమౌతుందనీ విజ్ఞులు ఊహిస్తున్నారు.

ప్రతీ నక్షత్రం కూడా తన జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు నోవా నక్షత్రరూపాన్ని దాలుస్తుందట! అయితే, సూర్యుడు నోవా నక్షత్రంగా మారినప్పుడు ఆ గోళంనుండి యీనాటికంటె ఎన్నో రెట్లు ఎక్కువగా వేడీ వెలుగూ ప్రసారితమౌతాయి కాబట్టి ఆ వేడికి తట్టుకోలేక భూమిమీది జీవరాశి అంతా అప్పుడు భస్మీపటలం కావలసిందే!!

నోవాలు వెలుగుతూన్నప్పుడు వానినుండి విశ్వమయయాఖాలు (*Cosmic rays*) అధిక దీప్తితో బయల్వెడలు నని శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. విశ్వమయయాఖాలు ద్రవ్యము వినాశము చెందినప్పుడు బయల్దేరు ననే నమ్మకానికి ఈ సాక్ష్యము కొంత బలము చేకూరుస్తుంది. నోవాలలోని ద్రవ్యము శక్తిగా మారి కాంతిగానూ, విశ్వమయయాఖాలుగానూ బయల్వెడలుతుందన్నా అనవచ్చునేమో! —'అనంత్'

## 94. ఫిరంగి గుండు వేగానికి పరిమితి వుందా?

శబ్దము గంటకి 750 మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది. తుపాకి గుండూ ఫిరంగి గుండూ ఇంతకి మించిన వేగంతో ప్రయాణం చెయ్యాలి. లేకపోతే ధ్వాన్ననే శబ్దమే ముందు వినబడిపోయి ఎర దెబ్బని తప్పించుకోవచ్చును. కోట బురుజులమీద నుంచి యుద్ధంచేసే సైనికులు శత్రువులు ఫిరంగి కాల్చిన మంటముందు కనబడుతుందనీ, తరవాత గుండు గోడకి తగిలీ ఆ తరవాతే ఫిరంగి మ్రోత వినపడుతుందనీ చెప్తారు. వెలుగు సెకనుకి 186 వేల మైళ్ళ దూరం ప్రసరిస్తుంది కనక ఫిరంగి మెఱుపు ముందు కనబడింది. ఫిరంగి గుండు ఈ వేగంతో ప్రసరిస్తే రెండున్నర సెకనులలో చంద్రుణ్ణి కొట్టవచ్చును. అది సాధ్యమా అని ప్రశ్న. అణుశక్తి ఉపయోగించి రాకెట్లు నడిపితే చంద్రలోకము చేర వచ్చునేమో అని వైజ్ఞానికులు కలలు కంటున్నారు. అయితే ఏ శక్తి ఉపయోగించినా ఫిరంగి గుండు వేగానికి ఒక పరిమితిఅంటూ వున్నదా? లేక ప్రయత్నమువల్ల ఎంత వేగాన్నైనా సాధించవచ్చునా? అంటోంది శీర్షిక. అసలే సాధించలేని వేగమున్నది ఏదీలేదనే నమ్మేరు వైజ్ఞానికులు మొన్న మొన్నటిదాకా. కాని అయిన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతము అవతరించాక వెలుతురుయొక్క వేగమే వస్తువుయొక్క వేగానికి అవధి అని తేలినది. అంటే వస్తువు ఎంత సూక్ష్మమైనదైనా, దాన్ని విసిరేది ఎంత గొప్ప శక్తి అయినా దాని వేగము మాత్రము సెకనుకి 186 వేల మైళ్ళు దాటదు.

ఈ సంగతి ఎలాగు తెలిసింది? అంటారా? ఇలాగు. ఒకబాణము విల్లునించి అతివేగంతో వెలువడిందనుకోండి. అయిన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతము ప్రకారము పైనుంచి చూచేవారికి దానికి పొడవు తగ్గినట్లు కనబడుతుంది. బాణముయొక్క వేగము హెచ్చినకొద్దీ దాని పొడవు తగ్గిపోతూన్నట్లు కనబడుతుంది. బాణవేగము వెలుతురుయొక్క వేగానికి సమమైనప్పుడు బాణము పూర్తిగా కుంచించుకు పోయినట్లు అవుతుంది. అంటే బాణానికి పొడవు సున్నా అవాలి. ఇది జరగని సంగతి అన్నారు. బాణ వేగము ఇంకా హెచ్చయితే దాని పొడవు ఋణము (*Negative*) అవాలి. ఇది ఊహించడానికే వీలులేదు. ఒక క్రియయొక్క ఫలితము ఊహించడానికే వీలులేనిదైతే ఆ క్రియే అసంభవము కావాలి. అంటే ఏవస్తువైనా, —ఫిరంగిగుండేనా సరే— వెలుతురుకంటె తక్కువ వేగంతోనే ప్రసరించ గలదు. వెలుతురు వేగమే వస్తువుల వేగానికి అవధి.

## చిట్టిప్రశ్నల జవాబులు

—కట్లపాము విషజంతువే. దాని కోరలు చిన్నవౌటవల్ల అది ఎక్కించే విషము త్రాచు ఎక్కించే విషముకంటె తక్కువ. కాని దీనివిషము త్రాచు విషముకంటె చాలా తీవ్రమైనది. అందువల్ల మరణము తప్పక సంభవించగలదు. త్రాచు విషమునకు 'యాంటీ వెనీను' అనే విరుగుడు కనిపెట్టినారు కాని కట్లపాము విషమున కింకా విరుగుడు కనిపెట్టలేదు.

—జీవము అనగా ఆహారాన్ని మింగి, పెరిగేదీ, పైనుంచి రేపినట్లయితే ప్రతిక్రియ చేసేదిని. ఇప్పటికి రమారమి 50 కోట్ల సంవత్సరాల క్రితము చిన్నచిన్న కణములవంటి జీవము ఉత్పన్నమైనవనీ, 17 కోట్ల ఏళ్ళ క్రితము సముద్రపు మొక్కలూ, వెన్నెముకలేని ప్రాణులూ ఉండేవనీ, క్రమముగా జలచరాలూ, ఉభయచరాలూ, సరీసృపాలూ, పాలు కుడిపే జంతువులూ, మానవులూ బయలేరి యుండవలెనని శాస్త్రజ్ఞుల అంచనా.



# మా అన్నయ్య

'అబ్బబ్బ యీ ఆడపిల్లలు పైకి ఏమీ ఎరగనట్లు వుంటారు కాని వాళ్ళ అల్లరి చూడాలి బాబూ, మగపిల్లల్ని మించిపోతారు' అంటో ఒక చిన్న లెక్చరు దంచేస్తున్నాడు మా అన్నయ్య, వాళ్ళ స్నేహితులతో హాల్లో కూర్చుని. ఈమధ్య మా అన్నయ్యకి నామీద కొద్దిగా కోపము వచ్చిందిలెండి, ఒక చిన్న తమాషా చేయడం మూలమున.

"నీ వన్న మాట నిజమేరా! బ్రదర్" అంటున్నాడు రామం.

రామం అంటే మా అన్నయ్య స్నేహితుడు. మా అన్నయ్య మాటకల్లా "తందానతాన" అనే రకం. "భళానోయి భాయిచంద్రం" అంటూవుంటాడు.

నేను ఫిఫ్త్‌ఫారం చదివే రోజులవి. మా చంద్రం అన్నయ్య చెన్నపట్నంలో చదువుతున్నాడు. మా మేనమామ కూతురు "సుధ" స్కూలు ఫైనల్ పాస్ అయిందన్నమాటే కాని, పిరికితనం జాస్తి. "సుధ"ని చిన్నప్పటినుంచి మా అన్నయ్యకు యిద్దామనుకుంటున్నారు. అసలే పిరికితనము. దానికి తగ్గట్టు మేము పెద్దవాళ్ళమయిన తరువాత ఒకళ్ళ నొకళ్ళు యిప్పుడే చూసుకోవడం మూలాన మా అన్నయ్యంటే, సుధకి, ఎంతో సిగ్గు. అన్నయ్య వస్తున్నాడంటే చాలు, అంత దూరాన అదిరిపడి చూచేది. అన్నయ్య ఎలాగేనా సుధని పలుకరిద్దామనుకుంటూ వుండేవాడు. కాని సుధ సాధారణంగ తప్పించుకుపోతూ వుండేది. అన్నయ్య చదువు పూర్తికాగానే పెండ్లి చేద్దామనుకుంటున్నారు మా అమ్మా నాన్నా. ఇంకో నాలుగయిదు నెలలు ఓపిక పడితే చక్కగ మాట్లాడవచ్చుగదా! వాడి కాతొందరెందుకు వాడిమనస్సులోని భావము నేను గ్రహించాను. అప్పటినుంచి ప్లాన్ వేస్తున్నాను ఎలాగయినా మాట్లాడిద్దామని.

ఒకసారి సుధని మా వూరు తీసుకువచ్చారు ఎలాగా అవబోయే కోడలే కదాని. సుధకి మాత్రం లోపల రావలెనని వున్నా పైకి మాత్రము నేను రాను బాబూ అంటూ బెట్టు సరి చేసింది. ఎందుకో తెలుసా? అప్పుడు అన్నయ్య సెలవులకి యింటికి వచ్చే రోజులవి. సుధ వచ్చిన వారం రోజులకు అన్నయ్య దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది, రెండు రోజులలో బయలుదేరివస్తున్నానని. వస్తానన్న రోజున నాన్నగారు, నేను సుధ స్టేషనుకి బయిలుదేరదామనుకున్నాము. ఆ రోజు మా యింట్లో సందడి ఏం చెప్పను. అమ్మ హడావిడి చెప్పనక్కర్లేదు. తెల్లవాఝుజామున లేచినది మొదలుకొని, "చంద్రంబాబు"కి యిది యిష్టం అది యిష్టం అంటూ ఒకయిరవై ఐటమ్సు ఆలోచించి ఆలోచించి ఆఖరికి బంగాళాదుంప వేపుడు, పప్పు పులుసు, గోంగూరపచ్చడి, పూరీలు, సేమ్యాపరమాన్నము వండి ఇంకా యేమిటో ఇవన్నీ చాలక వంటింట్లో నే సతమతమవుతూంది. "అమ్మాయ్...శశీ...... అబ్బాయి చంద్రం గదిని ఎటుగా సర్దివుంచమ్మా. చికాగ్గావుంటే వాడు విసుక్కుంటాడు," అంటూ నాన్నగారు.

'మణి'

ఇక కాబోయే వదినె "సుధ" ఆనందము ఏమి చెప్పను, కాని పైకి మాత్రము మామూలుగ వున్నట్లు నటించవలెనని తాపత్రయము. నాకు నవ్వాగటము లేదు. ఏ చీర కట్టుకోవాలో తోచటము లేదు కాబోలు ఈ చీర కాదని ఆ చీర, ఆ చీర కాదని యీ చీర ఎన్ని మార్చిందో లెక్కలేదు, ఆఖరికి అన్నయ్యకి నచ్చిన రంగులో (అన్నయ్యకి ఆ రంగు అంటే ఎంతో యిష్టమని ఏదో మాటల సందర్భములో చెప్పాను, మైసూరు జార్జెట్ చీర కట్టుకొని దానికి తగిన బ్లౌజ్ వేసుకొని క్రొత్తగ చేయించుకున్న స్టార్ నెక్లెస్ (ఆ నెక్లెస్ చేయించుకున్న తరువాత అన్నయ్య చూడలేదు, యిప్పుడు చూడ్డానికి కాబోలు) యింకా ఏవేవో సింగారించి ఒక్కసారిగ "సినిమాస్టార్"ని మించిపోయింది. నిజంగ మా వదినెను చూచేటప్పటికి ఆడదాన్నయిన నాకే యెలాగో అనిపించింది. కాని నేనంటే మా 'సుధ'కి బలే భయం. యేమి వుడికిస్తానో నని బెదురుతూనే వుంది. నేను యిదంతా ఓమూలనుంచి కనిపెడుతూనే వున్నాను. కాని ఆ వేళ మా వదినెమీద అపరిమితమైన దయ కలిగింది. నేను యేమన్నా అంటే ఆ వేళ మాతో స్టేషనుకి యేమయినాసరే రాదని (అసలు అమ్మ నాలుగు కేకలు వేసి మాతో స్టేషనుకి వచ్చే యేర్పాటు చేసింది) రాకపోయేసరికి మా అమ్మకి కోపము వస్తుందని వూరుకున్నాను. మేనకోడలంటే వెనకేసుకొస్తూ వుంటుంది మా అమ్మ.

ఎలాగయితేనేం నేను, సుధ తయారయి మా నాన్నగారితో కలసి జట్కామీద స్టేషను జేరుకున్నాము. తీరా మేము వెళ్ళేసరికి అరగంట ఆలస్యం అన్నారు. అన్నయ్య వస్తాడన్న సరదాలో ఆ అరగంట ఎలాగో ఒలాగ, గడిపేశాము. రైలు వచ్చే వేళకు సిగ్నలు యిచ్చారు. ఇక మా సుధ సంగతి యేమి చెప్పను. చూస్తుండగానే, పొగలు కక్కుకుంటూ మెయిలు తక్కిన స్టేషనులో ఆగేసరికి ఒక్క అంగలో రైలుదగ్గర కెళ్ళి ఇంటర్ కంపార్టుమెంట్సన్నీ కలయచూశాం. కాని మా అన్నయ్య వుంటేగా, రైల్లోనించి వూడిపడ్డానికి. ఈరోజు మావదినెగారు వచ్చారు కనుకే యింత బాగా అయింది. పాపం ప్రొద్దుటనుంచి శ్రమపడి అలంకరణ చేసినదంతా వృధా అయిందే అన్నాను. నిరాశతో, నిరుత్సాహంతో వున్న సుధకి ఒక్కసారిగ వుడుకు మోత్తనము పోయి అదోలా ముఖం పెట్టి 'పో నీ లేమ్మా నే నేమన్నా వస్తానన్నా నేమిటి మీరు బలవంతం పెడితే వచ్చాను కాని' అన్నది.

రాత్రి భోజనాలదగ్గర కూర్చున్నప్పుడు 'ప్రొద్దున పాపము అన్నయ్య వస్తాడని సుధ సరిగా తిండికూడా తినలేదు. అన్నయ్యకు వుంచిన టిఫిన్ వదినకే వేసేయవే అమ్మా. అన్నయ్య రాకపోవడమే మేలయింది వదినెకు' అన్నాను. 'ఏమిటే శశీ అస్తమానం నీ వేళాకోళాలు వెక్కిరింతలూనూ. దాని కసలే సిగ్గెక్కువ. చదువుకుం దన్నమాటే కాని నీలాగ కోతికొక్కిరాయి వేషాలేవీ వేయదు. అస్తమానమూ వుడికించావంటే వెళ్ళిపోతుంది కూడాను,' అన్నది అమ్మ.

ఆ రాత్రి భోజనాలు అవగానే కాసేపు అన్నయ్య ఎందుచేత



ఎంతసేపటికి లేవకపోయేసరికి గబుక్కున ముసుగు తీసేటప్పటికి......

కాలేదా అనే చర్చ జరిగినపిమ్మట ఎవరి గదులకు, వాళ్ళము వెళ్ళి పడుకున్నాము. నాకు మెలుకువ వచ్చేటప్పటికి హాల్లో అమ్మగొంతు వినిపిస్తోంది. "కాళ్లు కడుక్కోరా బాబూ చంద్రం నీకోసము నాన్నగారు, శశి, సుధ స్టేషనుకు వచ్చారురా" అంటోంది.

"రైలు దాటిపోయిందమ్మా అందుచేత మధ్యాహ్నము రాలేక పోయాను" అంటున్నాడు అన్నయ్య.

అన్నయ్యమాట వినేసరికి చటుక్కున లేచి వద్దామనుకున్నాను కాని వాళ్ల సంభాషణ విందామని దొంగనిద్ర నభినయిస్తున్నాను. "సుధ యిక్కడే వున్నదమ్మా!" అని గబుక్కున నాలిక కరుచుకున్నాడు కాబోలును ప్లేటు మార్చేసి "శశి పడుకున్నదా లేక దొంగనిద్రా" అంటూ నేను పడుకున్న గదిలోకి షర్టు విప్పకుండా వచ్చాడు. ఇక మన అసలురూపు పని పట్టాడు కదాని "ఏంరోయి అన్నయ్యా ఎప్పుడొచ్చా"వంటూ కళ్లు నులుముకుంటూ లేచాను. అప్పటికి నా ప్రక్కగదిలో సుధ గాఢ నిద్రలో మునిగితేలుతోంది. అన్నయ్యా వచ్చినసంగతి దానికి తెలియదు. "ఒరేయి అన్నాయ్ రేపు నే చెప్పినట్లా చేసేయరా నేనో గొప్ప ప్లాన్ వేశాను"అన్నాను. ఏధ్యాసలో వున్నాడో ఏమిటో "అలాగే లేవే" అన్నాడు.

తెల్లవారగానే అమ్మ మా అందరికన్న ముందులేచి వంటింట్లో కాఫీ, టిఫిన్ తయారుచేస్తోంది. మళ్లీ యిప్పట్లో వంటిల్లు వదిలిపెట్టిరాదుకదా అనే ధైర్యముతో మా అన్నయ్య గదిలోకివెళ్ళి అన్నయ్యని లేపేశాను. "ఏమిటే బాబూ అప్పుడే లేపేశావు."అంటూ గట్టిగా మాట్లాడబోయేసరికి "ఉష్...అబ్బ.. గట్టిగ అరవకు మరి." నెమ్మదిగ అమ్మ గదిలోకి, చప్పుడు చేయకుండా వెళ్లి పడుకొని రగ్గు కప్పేసుకో. అని వాణ్ణి పంపేశాను.

నేను లేచి ముఖము కడుక్కొని లోపలికి వస్తోంటే వళ్ళు విరుచుకుంటూ, కళ్ళు నులుముకుంటూ సుధ ఎదురయింది.

"ఏమే సుధా యింకా అమ్మ లేవలేదు వెళ్ళి మీ అత్తగార్ని లేపుకురావే" అన్నాను పాపం దానికేం తెలుసు. లేపుకు రావడానికి వెడుతో వుంటే నేను "మనసా నే నెవరో నీకు తెలుసా... తెలుసా..." అంటూ సినిమాగీతం ఆలాపించుకుంటూ నా గదిలోకి వెళ్లిపోయాను. నాకు నవ్వాపుకుందామన్నా ఆగటములేదు. గట్టిగా నవ్వితే అసలు రంగము చెడుతుందని ఎలాగో బిగపట్టుకొని ప్రక్కనుంచి చూస్తున్నాను సుధ అమ్మగదిలోకి వెళ్ళి "లే అత్తయ్యా, లే అత్తయ్యా తెల్లవారిపోయింది,"అని లేపుతోంది. లోపల ముసుగులో పడుకున్న మా అన్నయ్య పలుకేమి చెప్పను. ఎంతసేపటి, లేవకపోయేసరికి గబుక్కున ముసుగు తీసేటప్పటికి, మా సుధ గుండె రక్కున ఆగినంత పనయిందిట పాపం (తర్వాత చెప్పింది నాతో) "హా. మీ...రం అ...త్త. య్యా అనుకు

(౫౮–వ పేజీ చూడండి)



హైదరాబాద్ పురోద్యానం




# అందమైన పూలు

శ్రీ లవణం



అందమైన పూలు మేము
చందమామ జ్యోత్స్నవోలె
జగతిలోని కొచ్చినాము

    మంచి గంధమంత మాది
    ఎంచిమీరు తీసుకొండు—

మోదమెంతో మోముమీద
నవ్వుచుండ ఆశతోడ
జగతిలోని కొచ్చినాము

    అంతమందు కూడ మేము
    నవ్వుతోనె పోయెదము—

గగన మంత ఎర్రబారి
ఉషసు కూడ నవ్వుచుండె
మేలుకొండు మీరు ఇపుడు

    అరుణరేఖ లావరించి
    అవనికూడ జేవురించె—

చూడరండు తోటలోన
పూవులన్ని విచ్చుకొనియె
మంచు అంత మెరయుచుండె

    కోయిలెంతొ హాయిగొల్ప
    పాటపాడి పిలుచు చుండె—

రండు మీరు బాలలార
కోయిల వలె పాటపాడి
పూవువోలె మనసు విప్పి

    ఉషసువోలె నవ్వుదాము
    జీవకాంతి జిమ్ముదాము—

మనదుతోట అంతకూడ
ప్రేమపెంచి శ్రేయమిచ్చు
పూలతోడ నింపుదాము

    పూలతోనె చెలిమి పెంచి
    పూలవోలె మనలుదాము—



సీరియల్

# విచిత్రవ్యక్తి

మూలం:- మార్క్ ట్వేన్

**జరిగినకథ:**— ఆస్ట్రియాలోని ఈజెల్‌డార్ఫ్ మా స్వగ్రామం. నా యీడు వాళ్ళే అయిన సెప్పి, నికొలాస్ అనే మరి ఇద్దరు బాలురతో కలిసి ఎప్పుడూ అడవుల్లో, కొండల్లో తిరిగేవాళ్ళం. ఒక రోజున మేము ఒక కొండమీద మా ఆట స్థలంలో కూర్చుని ఉండగా ఒక కొత్త వ్యక్తి వచ్చాడు. తన పేరు సైతాను అనీ, తను దేవతననీ చెప్పాడు. మాకు చాలా వింతలు చేసి చూపించాడు. అతడు మాతో ఉన్నంతసేపూ మానవజాతిని నానాబూతులు తిట్టాడు. మానవులు తామేదో గొప్పవారమని అనుకుంటారుగాని నిజానికి వారిలో ఉన్న నైచ్యం ఇంకెక్కడా ఉండదని అన్నాడు. ఈ సృష్టి ఆదినుంచీ మానవుడు ఎంతగా హింసాకాండలు జరిపిందీ, జరుపుతున్నదీ, జరుపనున్నదీ మాకు అంతా కళ్ళకు కట్టినట్లు చూపించాడు. మానవజాతి యింతవరకు అభ్యుదయం పేరిట సాధిస్తున్నది మారణాయుధాలను కనిపెట్టటమే నని నిర్ధారణచేసి చెప్పాడు.

## 10

రోజులకి రోజులు గడిచిపోతున్నాయి. కాని సైతాను జాడ ఎక్కడా లేదు. సైతాను సాన్నిధ్యానికి అలవాటయిన తరవాత అతడు లేని క్షణాలు ఎంత నిర్జీవంగా, నిరుత్సాహంగా ఉంటాయో చెప్పనక్కరలేదు.

జ్యోతిష్కుడు యథా ప్రకారంగా గ్రామంలో విశృంఖల విహారం చేస్తూనే వున్నాడు. అతడు మంత్రగాడనే అభిప్రాయం ప్రబలి వున్నందున ఎవ్వరూ అతని చాయలకు పోవటం లేదు. కాని అడపా దడపా ఎవడో ఒకడు భయపడుతూ భయపడుతూ రాయి విసిరి పారిపోవటం కూడా జరుగుతోంది.

సైతాన్ను చూసినప్పటి నుండీ మార్గెట్ అతనిమీద భ్రమ పెట్టుకున్న మాట వాస్తవం. అయితే సైతాను ఒకటి రెండుసార్ల కంటె ఎక్కువ ఆమె ఇంటికి వెళ్ళలేదు. తనకోసం ఊళ్లో పడుచువాళ్లు అంత మోజుపడుతుండగా, సైతాను తన్ను నిర్లక్ష్యం చెయ్యటం, ఆమెకు ఒకింత గర్వభంగమే అయింది. ఆ కారణం చేత మార్గెట్ సైతాను మీద మోజు క్రమంగా తగ్గించివేసుకోసాగింది. అటు విల్హెల్మ్ మీడ్లింగ్ పరిస్థితి కూడా మొదట్లో అలాగే అయింది. తన ప్రియురాలు మార్గెట్ సైతాను మీద మరులు కొన్నదని అతడు దిగులు పెట్టుకున్నాడు. విరక్తితో పొద్దస్తమానమూ మద్యం తాగుతూ గడపసాగాడు. రోజు రోజుకీ విల్హెల్మ్ చెడిపోతున్నాడని వృద్ధదాసి ఉర్సులా మార్గెట్ చెవిలో ఇల్లుకట్టుకుని నూరేది. విల్హెల్మ్ ఇలా పాడైపోవటానికి తన చపల చిత్తమే కారణం గదా అని మార్గెట్ ఎంతో పశ్చాత్తాపడి ఏడ్చింది. చివరి కొకరోజున అతనికి కబురు చేసింది; తన పినతండ్రి కేసు త్వరలో విచారణకు రాబోతోంది కనుక ఆయన పక్షాన వకాల్తా పుచ్చుకుని వాదించవలసిందని కోరింది. మార్గెట్ నుంచి ఇన్నాళ్లకు కబురందగానే విల్హెల్మ్ విరక్తి పటాపంచలై పూర్వపు

 అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు 

# ★ విచిత్ర వ్యక్తి ★

ఉత్సాహం తిరిగి వచ్చింది. తాగుడు వదిలి వేశాడు. ఫాదర్ పీటర్ కేసుమీద శ్రద్ధవహించాడు. నన్నూ, సెప్పీని చాలాసార్లు తన ఆఫీసుగదిలో కూర్చుండ బెట్టుకుని కేసు వివరాలన్నీ మళ్లీ మళ్లీ చెప్పించు కున్నాడు. ఎంత చేసినా అతనికి ఈ కేసు గెలుస్తుందనే నమ్మకం ఏర్పడలేదు. ఫాదర్ పీటర్ మీద, మార్గరెట్ మీద అభిమానం కొద్దీ పనిచేయ నిశ్చయించు కున్నాడే గాని కేసు మాత్రం బహు బలహీనంగా వుందని అతడెరుగును.

"ఇప్పుడు గనక సైతాను వస్తే!" అని నిరంతరమూ అనుకునేవాణ్ణి. ఏదో చేసి కేసు గెలిపిస్తాడు. కేసు గెలుస్తుందని అతడు చెప్పనే చెప్పాడు. అందుచేత గెలిచే విధానం కూడా అతనికి తెలిసి వుంటుంది.

కాని ఎన్ని రోజులైనా సైతాను రానే లేదు. కేసు గెలుస్తుందనీ, ఆ పిమ్మట ఫాదర్ పీటర్ కష్టాలన్నీ తొలగి పోతాయనీ, ఆయనకి మంచి రోజులు వస్తాయనీ, నాకు ధైర్యం వున్నప్పటికీ, అదెల్లా జరుగుతుందో తెలియనందున, అదేపనిగా తహతహ లాడి పోయాను. నిజానికి ఫాదర్ పీటర్ ఇక ముందైనా సుఖపడితే గాని లాభం లేదు. ఇప్పటివరకూ ఆయనకి కష్టాలమీద కష్టాలే. అందులో జైలు జీవితం మూలంగానూ, అవమాన భారం వల్లనూ ఆయన మరీ క్రుంగి, కృశించి పోయాడని విన్నాను. త్వరలో విడుదల కాకపోతే ఇంకెన్నాళ్లు బతుకుతాడు!

ఎలాగైతే నేం విచారణ దినం వచ్చింది. విచారణ చూట్టానికి ఎక్కడెక్కడి జనం వచ్చారు. దూరపు గ్రామాలనుండి కూడా వచ్చారు. కోర్టు మందిరం కిటకిట లాడింది. అందరూ అక్కడఉన్నారు గాని నిందితుడు మాత్రం లేడు. ఆయన మరీ బలహీనంగా వున్నందున కోర్టులోకి తీసుకు రావటానికి వీల్లేక పోయింది. మార్గరెట్ వచ్చింది. లేని ధైర్యం తెచ్చుకుని ఒకచోట కూర్చుంది. కేసుకు మూల కారణమైన డబ్బు కూడా అక్కడ హాజరుపరచ బడింది. ఒకబల్లమీద నంచీ గుమ్మరించారు. గుప్పిళ్లతో నాణాలు తీసుకుని, దురదపెట్టే వేళ్లతో ముద్దులాడి, జేబులో వేసుకోటానికి వీల్లేనందుకు లోపల్లోపల ఏడ్చే మహాద్భాగ్యం కొంతమంది కోర్టు అధికారులకే దక్కింది. మిగతా ప్రేక్షకులంతా అంత డబ్బు చూసి లొట్టలు వెయ్యటం తప్ప ఇంకేం చెయ్యలేక వూరుకున్నారు.

జ్యోతిష్కుడు బోనులో నుంచున్నాడు. ఈ సందర్భానికిగాను అతడు తనకున్న దుస్తుల్లోకల్లా మంచి ఖరీదైనవి ధరించి వచ్చాడు.

ప్రశ్న:—ఈ డబ్బు నీదని వాదిస్తున్నావు కదూ?

జవాబు:—అవును.

ప్ర:—ఇంతడబ్బు నీకెక్కడిది?

జ:—నేను ఒకసారి పొరుగూరి నుంచి మన వూరు తిరిగి వస్తుండగా రోడ్డుమీద దొరికింది.

ప్ర:—ఎంతకాల మైంది?

జ:—రెండేళ్లు దాటింది.

ప్ర:—తరవాత ఏం చేశావు?

జ:—ఇంటికి తీసుకొచ్చి నాగోపురంలో ఒక రహస్య స్థలంలో దాచాను. ఆడబ్బెవరిదో కనుక్కుని వారికి తిరిగి ఇచ్చి వేయాలను కున్నాను.

ప్ర:—మరి కనుకున్నావా?

జ:—చాల నెలలపాటు అతి శ్రద్ధగా వాకబు చేశాను. కాని ఆ పోగొట్టుకున్న మనిషెవరో తెలియ లేదు.

ప్ర:—తరవాత?

జ:—ఇక వాకబు చెయ్యటం అనవసరమను కున్నాను. మనవూళ్లో వున్న అనాథశరణాలయం తాలూకు భవనం పూర్తి చెయ్యటానికి ఈ డబ్బు వినియోగిద్దామను కున్నాను. అప్పుడు రహస్యస్థలం నుంచి డబ్బు ఇవతలకు తీసి అంతా ఉందో లేదో లెక్క పెడుతున్నాను. అప్పుడు—

ప్ర:—చెప్పు. ఆగావేం?

జ:—క్షమించాలి, నిజం చెప్పవలసి వస్తున్నందుకు. డబ్బు లెక్కపెట్టి యధాస్థానంలో దాచి,

లేచి నుంచుని చూస్తే నా వెనకాలే ఫాదర్ పీటర్ ఉన్నాడు.

ప్ర:—అప్పుడు నువ్వు కంగారు పడ్డావా?

జ:—ఊహు. అప్పుడు ఆవిషయమై నేనేమీ అనుకోలేదు. అలా అప్పుడప్పుడు ఒకటీ అరా అవసమైతే నాదగ్గిరికి రావటం ఫాదర్ పీటర్‌కి అలవాటే.

ఈముక్క విని మార్గెట్ అవమానంగా భావించింది. తనపినతండ్రి నీచుడైన జ్యోతిష్కుని వద్దకు వెళ్లి చేబదుళ్లు తెచ్చుకుంటాడన్న మాట అబద్ధమని చెప్పేద్దామని లేవబోయింది. కాని మళ్లీ తమాయించుకుని ఆగింది.

ప్ర:—ఊ. తరవాత ?

జ:—చివరికి ఆధనం అనాథశరణాలయాని కివ్వటానికి జంకాను. మరొక ఏడాదిపాటు ఆగి చూద్దామనుకున్నాను. ఫాదర్ పీటర్‌కి డబ్బుదొరికిందనే కబురువిని నేనేమీ అనుమానించకపోగా సంతోషించాను. రెండురోజులతరవాత నా వద్ద డబ్బుచూసుకుంటే, లేదు. అప్పుడు కూడా ఫాదర్ పీటర్ మీద అనుమానం కలగలేదు. కాని మూడు కారణాలుబట్టి ఆయనే దొంగిలించి వుంటాడని అభిప్రాయపడ్డాను.

ప్ర:—ఏమిటవి ?

జ:—ఫాదర్ పీటర్‌కు కాలిబాటమీద డబ్బు దొరికింది; నాకు రోడ్డుమీద దొరికింది. ఫాదర్ పీటర్ డబ్బు అచ్చగా బంగారపు డకట్లే తప్ప మరొక లోహంకాదు; నాడబ్బూ అంతే. ఇహడకట్ల సంఖ్య కూడా సరిపోయింది; సరిగా పదకొండువందల ఏడు డకట్లు.

అక్కడితో జ్యోతిష్కునిసాక్ష్యం ముగిసింది. కోర్టువారు, మిగతావారూ కూడా అతని సాక్ష్యం బలంగా ఉందని భావించారు.

విల్హెల్మ్‌మిడ్లింగ్ జ్యోతిష్కుణ్ణి కొన్ని ప్రశ్నలడిగాడు. తరవాత మమ్మల్ని పిలిచాడు. మేము బోనులో కెక్కి మాకథ అంతా చెప్పాము. జనంవేళాకోళంగా నవ్వారు. మేముచాలా సిగ్గుపడ్డాము. విల్హెల్మ్ మిడ్లింగ్‌కూడా పైకి నిబ్బరంగా ఉన్నా, లోపల నిరాశచేసుకునే వున్నాడు. జ్యోతిష్కుడు వట్టి నీచుడని ఊళ్లో అందరికీ తెలుసు; అయినా అతడు చెప్పింది అంతా కాకపోతే కొంతైనా నమ్మటానికి వీలుగా వుంది; ఫాదర్ పీటర్ వైపు సాక్ష్యం బొత్తిగా నమ్మవీలుగాకుండా వుంది.

మాసాక్ష్యం అయిన తరవాత జ్యోతిష్కుని తరఫు న్యాయవాది లేచి మమ్మల్ని ప్రాసుక్యూషను చెయ్యననీ, చేస్తే మమ్మల్ని మరీ అవమానించినట్టవుతుందనీ అన్నాడు. ఈమాటలకి జనం మళ్ళీ నవ్వారు. తరవాత అతడు మా కథమీద వ్యంగ్యంగా, హేళనగా చిన్న ఉపన్యాసం ఇచ్చి ప్రేక్షకులను తిరిగి నవ్వించాడు. నాకూ, సెప్పీకి ముఖాలు రామ్ములక్కాయల్లాగ ఎర్రబడిపోయినయ్; కళ్లనీళ్ల పర్యంతం అయింది. మార్గెట్ ఇక ఆపుకోలేక ఒక్కసారిగా ఏడుపు మొదలెట్టింది. ఆమెను చూస్తే నాకెంతో జాలివేసింది.

ఇంతలో నా వొళ్లు ఝల్లుమని పులకరించింది. విల్హెల్మ్ మిడ్లింగ్ పక్కన సైతాను నిలుచుని వున్నాడు. సైతానుకూ మిడ్లింగ్‌కూ ఎక్కడా పోలికేలేదు. సైతాను ఠీవిగా, నిర్భయంగా, ప్రశాంతంగా ఉన్నాడు. మిడ్లింగ్ నిరుత్సాహంగా నీళ్లుకారుతున్నాడు. సైతాన్ను చూసేసరికి మాకు ధైర్యం కలిగింది. అతడు వచ్చాడుగనక మాపక్షం నెగ్గుతుంది; తెలుపునలుపు, నలుపుతెలుపు అని, లేక అతని ఇష్టంవచ్చిన రంగు అని నమ్మించగలడు. సైతాన్ను చూసి జనం ఏమనుకుంటున్నారోనని చుట్టూ చూశాము. కాని ఎవరూ అటువంక చూడటమేలేదు. అందుచేత అతడు మిగతా వారికి అగోచరుడై వున్నాడని గ్రహించాము.

జోతిష్కుని తరఫు న్యాయవాది తన ఉపన్యాసము ముగించబోతున్నాడు. ఆ సమయంలో సైతాను నెమ్మదిగా విల్హెల్మ్‌లో ఐక్యంకావటం మొదలెట్టాడు. విల్హెల్మ్‌లో హఠాత్తుగా మార్పువచ్చింది. అతని కళ్లు, ముఖం తేజస్వంతమైనాయి.

న్యాయవాది ఈ విధంగా ముగించాడు.

"అదుగో చూడండి, బంగారం! ఇదే సమస్త పాపాలకు కారణభూతమైనది. ఇదే యుగయుగాలనుంచి మానవమాత్రులను పాపపంకంలోకి ఈడుస్తున్నది. ఆఖరికి భగవంతుని అర్చకుడైన ఈ మతగురు

(42-వ పేజీ చూడండి)

# గానుగెద్దు

మా మాష్టారు, పాఠాలు సరిగా చదవని వాళ్లనీ, ప్రశ్నలకు సరిగా సమాధానాలు చెప్పలేని వాళ్లనీ "ఒరేయ్ నీకంటే 'గానుగెద్దు' నయంరా!" అంటూండే వారు.

మా క్లాసులో 'మొద్దబ్బాయి నెంబరు వన్' రామిగాడున్నాడు. మిగతావాళ్లకు పుస్తకం అంతా ఐపోయినా, వాడికి మాత్రం మొదట పాఠం కూడా వచ్చేది కాదు. అందువల్ల మాష్టారు వాణ్ణి ఎప్పుడు చూచినా 'ఒరేయి "గానుగెద్దూ!" అని పిలుస్తూండే వారు. ఈ రామిగాణ్ణి 'పప్పు రాము' డనీ, 'గానుగెద్దు' అని మాష్టారుతో పాటు పిల్లలందఱూ కూడా తెగ వేళాకోళం చేసేవారు.

ఇలా కొంతకాలం జరిగాక, ఎప్పుడు చూచినా, మాష్టారు "గానుగెద్దు" అనడం వింటూంటే, దాని అర్థం ఏవిటో తెలుసుకోవాలన్న ఆదుర్దా మాలో కొందరికి కలిగింది. మామూలుగా పప్పు రాముడంటే, ఎందుకూ పనికిరానివాడని, మా అందరికీ తెలిసిందే! కానీ ఈ "గానుగెద్దే"విటో మాత్రం మాకర్థమయేది గాదు. అందుకని దీని అర్థమేమిటో ఎలాగైనా మాష్టారు నడిగి తెలుసుకోవాలని మేమందరము నిశ్చయించుకున్నాము. కాని, ధైర్యంచేసి, ఎవ్వరమూ ఆయన ఎదటబడి అడగలేక పోతూండేవాళ్లము ఎన్ని రోజులైనా ఈ కోరిక ఇలాగే నిల్చిపోయింది—మా పిరికితనం వల్ల.

* * *

చివరికొకనాడు మాస్టారు హుషారుగా బలిచక్రవర్తి పాఠం చెబుతున్నారు. మన 'పప్పు రాముడు' గూడా పాఠం వింటూనే ఉన్నాడు. ఇంతలో ఎవరో ఏదో అల్లరి చేశారు పాఠం వినకుండా. మాస్టారు పిల్లలందరివంకా వరసగా చూసుకొస్తూ పప్పు రాముడి వంక కూడా చూశాడు.

శ్రీమతి కృష్ణవేణి

"ఒరేయ్ బలిచక్రవర్తి ఎలాంటి వాడురా?" అని వాణ్ణే ప్రశ్న వేశారు.

పప్పు రాముడు "మే...మ్మె... మ్మె..." అన్నాడు.

మాష్టారు వెంటనే, "ఓరి గానుగెద్దా" అని పకపకా నవ్వేరు.

అదే సమయమని "మాష్టారూ, గానుగెద్దని అంటూంటారే, దాని అర్థమేవిటండీ?" అని ఒక్కసారిగా, మాజట్టు జట్టంతా అన్నాము. మాష్టారు ఆవేళ సంతోషంగా ఉన్నారేమో, మేము అడగ్గానే తిట్టకుండా మమ్మల్ని చూసి నవ్వుతూ ఇలా చెప్పారు:-

"ఏం లేదురా అబ్బాయిలూ; దీనికో చక్కని కథవుంది వినండి" చెపుతానన్నారు.

పిల్లలందరూ మాష్టారు ఏం చెబుతారోనన్న ఆత్రంతో చెవులు దోరగిలబెట్టి, చీమ కదిలినా వినిపించేంత నిశ్శబ్దంగా చూచున్నారు.

మాష్టారిలా ప్రారంభించారు:

"మనకు మోటారు కార్లూ, రిక్షాలూ, సైకిల్ రిక్షాలూ, ఆటో రిక్షాలూ, లేని రోజులవి. అప్పుడు రైలుకూడా చాలా చోట్లకు పోయేందుకు వీలు లేదు. కాలినడకనో బండ్లమీదనో ప్రయాణం చేసే వారు. అప్పటికి నేను చాలా చిన్నవాణ్ని. అలాంటి రోజుల్లో మా ఊరికి ఒక తాసీల్దారుగారు వచ్చారు. ఆయన మా గ్రామానికి దగ్గరలో ఉన్న బస్తీకిపోయి కలక్టరుగార్ని చూడాల్సివచ్చింది. ఆరోజుల్లో తాసీల్దార్లకు, రెవిన్యూ ఇన్స్పెక్టర్లకు, స్వంత గుఱ్ఱపు బండో, ఒంటెద్దుబండో వుండేది. ఈ తాసీల్దారుకుమాత్రం ఏ బండీ లేకపోవడాన, మా ఊరువచ్చి మా గ్రామమునసబుకు కబురు చేసి, తనకు రెండెడ్ల బండిగానీ, ఒంటెద్దు బండీగాని ఏర్పాటుచేయమనీ, మరునాటి ఉదయం 8 గంటలకల్లా కలెక్టరుగారిని చూడాలనీ, అలా వెళ్లకపోతే మాటొస్తుందనీ, చాలా అవసరంగా ఏర్పాట్లు చేయించమనీ చెప్పారు.



అలాంటప్పుడు మన మునసబు గారు, తాసీల్దారుగారి మాట తీసెయ్యగలరా? 'అలాగే బాబూ: సాయంత్రానికల్లా పూర్తి చేయిస్తా' నని ఇంటి కొచ్చాట్ట.

మాట అయితే యిచ్చాడు కానీ అవి కుప్పనూర్పిళ్ల రోజులవడంచేత ఒక ఎద్దు గాని బండి గాని, ఊళ్లో దొరికేట్లు కనిపించ లేదు. ఎంతమందినో, బ్రతిమాలే వాళ్లను బ్రతిమాలి, కోపగించే వాళ్లను కోపగించీ, ఎన్నో విధాల తాసీల్దారుగారి వల్ల మాటరాకుండా చూసుకోవాలని ప్రయత్నించాడు మునసబు. ప్రయోజనం లేక పోయింది. ఆఖరుకు ఒక ఒంటెద్దు బండి తోలుకొనే సాయిబు జ్ఞాపకం రాగా, అతనికి కబురుచేసి ఈ విషయమంతా చెప్పాడు.

"బాబూ, నా యెద్దు కాస్తా మొన్న గొడ్ల రోగాల మూలంగా చచ్చిపోయింది. ఎవర్నైనా ఒక ఎద్దును ఇమ్మనండి. కావాలంటే నేనే నాబండికి కట్టుకొని బండివెంట పోయి బాబుగార్ని బస్తీలో దిగ విడిచి వస్తాను." అన్నాడు సాయిబు.

"సరే అలాగయితే నేను విచారించి కబురు చేస్తాను, నువ్వు మాత్రం సిద్ధంగా ఉండ"మన్నాడు మునసబు 'సరే' నని సాయిబు ఇంటికెళ్లాడు.

"ఆ సాయంత్రం ఎటూ దిక్కు తోచక మునసబు తెలుకుల వీరయ్యకు కబురుచేసి, అతని నూనెగానుగకు కట్టే ఎద్దును ఇచ్చేటట్టు ఏర్పాటుచేసి సాయిబుకు ఆయెద్దు నప్పగించి ఆరాత్రి 9 గంటలకు తాసిల్దారు గారిని ప్రయాణం చేశాడు. తాసిల్దారుగారు, పెందరాడే భోజనం వగైరాలు ముగించుకొని ప్రయాణానికి సిద్ధమయారు. వీరితోపాటు ఊరి పొలిమేర వరకు మునసబు వెళ్లి సాగనంపి వచ్చేశాడు.

బండి చేల కడ్డంబడి పోతున్నది. గానుగ తిరగడమేగాని బండిలాగే అలవాటులేని ఈ ఎద్దు, దారి పొడుగునా నడవడానికి చాలా హంగామా చేసింది. ఇలా కొంతసేపు ప్రయాణం చేశాక, అంటే అప్పటికి రాత్రి 12 గంటలుండచ్చు- తాసీల్దారుగారూ, బండితోలే సాయిబూ కునకడం ప్రారంభించారు.

( -వ పేజీ చూడండి)

# చదువుకొనే గది

[తెర ఎత్తే సరికి చదువుకునే గది కనిపిస్తుంది. ఒక టేబిలు, రెండు కుర్చీలు, ఒక బెంచీ ఉంటాయి. టేబిలుమీద కొన్ని లావాంటి పుస్తకాలు చిందర వందరగా పడి ఉంటాయి. అలారం గడియారంలో గంట 4½ అయింది. ఒకమూలగా ఫ్లాస్కు ఉంటుంది]

సుశీ, రామం, చేతిలో పుస్తకాలు పుచ్చుకొని అప్పుడే స్కూలు నుండి ఏదో మాట్లాడు కుంటూ గదిలోపలికివస్తారు. సుశీకి 8 సం॥లు; రామానికి 10 సం॥ లు ఉంటాయి)

సుశీ:- ఒరేయ్! నిజంగా నాకు అన్నయ్యమీద బలే కోపం వస్తున్నదిరా.

రామం:- ఏం? అక్కయ్యగారు మాత్రం? ఆవిడగారూ ఏమీ తిసిపోలేదు.

సుశీ:- అయినా-మనం చదువుకుంటే వీళ్ళదేం పోయిందిరా?

రామం.- వీళ్ళొక్క రేలాగుంది ఈ యింట్లో మహా చదువుకుని ఏడ్చేవారు. నీకు తెలీదుగాని సుశీ- ఇవాళ మా మాష్టా రేమన్నారో తెలుసా?

సుశీ: అవున్నా-మా మాష్టారు రేపు పద్యా లప్పచెప్పక పోతే ముక్కాలువిరగ తంతా నన్నారురా!

రామం:- అది సరేలే! ఇక పరీక్షలెన్ని రోజు లున్నాయో తెలుసా?

సుశీ.- ఊఁ!...

రామం:- ఊఁ! ఏమిటి? చెప్పు.

సుశీ:-నాకు తెలియదు నువ్వే చెప్పు.

రామం:- అలాగను! మాది పెద్దక్లాసవడం వల్ల ఎప్పుడు పరీక్షలో మాకు ముందే చెప్తారులే!

సుశీ:- అయితే మరెప్పుడు?

శ్రీ దొంతంశెట్టి వీరభద్రరావు

రామం:- చాలా దగ్గిర కొచ్చేశాయట. చదువుకోకపోతే మన పని వుత్తిదే! సరిగా వారం రోజు లుందనగా చెబుతారట.

సుశీ - మరి, చదువు కోవట మెప్పుడు?

రామం:- అందుకే చెబుతుంట! ఈలోపులోనే చదువుకోవాలి.

సుశీ:- అవును రా! ...కానీ, నిన్న కొంచెం గట్టిగా ఎక్కాలు చదివానని అన్నయ్యగారు ఇంత ఎత్తున లేచాడు నామీదికి.

రామం:- వీళ్ళతో ఇదే గొడవే నే! పోనీగదా-కొంచెం ఎక్కువ చదువుకుంది గదా అని అక్కయ్యని ఒక లెక్కచేసి పెట్ట... మీరా వీల్లేదన్నది.

సుశీ:- అంతే కాదట, మనం చెడ్డ అల్లరి చేసేస్తున్నా మటా; నాన్నగారితో చెప్పి అసలు ఇక్కడకు రానివ్వనే రానివ్వరట.

రామం:- అబ్బ! మహాలావు చదువు చదువు.తున్నారని. ఆడికీ మరీ గోటు. గొప్పగా సైకిల్ తొక్కు కుంటూపోయి వస్తాడు. కమ్మగా టీ తాగి హాయిగా నిద్రపోతాడు.

సుశీ:- అవును రా రామం అన్నయ్యా! ఈ ఎఱ్ఱటి ఫ్లాస్కు వంచి వాడు చిక్కని టీపోసుకు తాగుతూంటే నానోరు వూరిపోతుంటుంది రా! ఒక చుక్క మన నోట్లో పొస్తే వాడికేం తక్కువైపోతుంది, చెప్పు!

రామం:- ఊఁ!...అది కాదే, రేపటి నుంచీ మనకూ పరీక్షలేగా. అమ్మతో చెబుదాం: చెబితే మనకు కూడా మరో ఫ్లాస్కు ఆ బీరువాలో ఉంది చూడు దాని నిండ టీపోసి ఇస్తుంది.

సుశీ.- అబ్బే, లాభం లేదురా! పైగా కసిరేసి, 'వాళ్ళు పెద్దవాళ్ళు, మీరు టీ తాగితే జబ్బు చేస్తుం దం'టుంది. అందుకే చూశావా! మనకొక రోజునైనా టీ ఇ... ఇచ్చిందా - అ...

రామం:- ...

పోనిలే. ఆ టీ వాళ్లనే త్రాగమందాం. మన్ని కూడా ఇక్కడ చదువుకోనిస్తే అంతేచాలు.

సుశీ:- ఏమో! నాకు మాత్రం వారితో కలిసి చదవడం ఇష్టం లేదురా. అయినా, అన్నయ్య నాన్నతో చెప్పే ఉంటాడంటావా?

రామం:- ఏమో, అసలు నువ్వెక్కు ఎందుకు గట్టిగా చదవాలి? నాన్నతో చెబితే మాత్రం ఇక మన్నిక్కడకు రానీయనే రానివ్వరు. అన్నయ్యంటే ఎంత ఇష్టమో నాన్నకు!

సుశీ:- అవునురా మొన్న వాడికి వాచీ కూడా కొనిపెట్టారు కదురా, నాన్న?

రామం:- లేకపోతే ఏదైనా ఉపాయం ఆలోచించాలి.

సుశీ:- అంటే?

రామం:- అంటే, అటు అన్నయ్యకూ, ఇటు అక్కయ్యకూ కూడా ఇష్టమయ్యే పని...

సుశీ:- అయితే చదవడం మానేసి హాయిగా నిద్రపోమంటారు.

రామం:- నీది ఒఠ్ఠి మట్టి బుఱ్ఱ! వాళ్ళ పనీ జరగాలి, మన పనీ జరగాలి. అల్లాంటి ఉపాయం వెదకాలి.

సుశీ:- ఓహూ... అదా!... అసలు వాళ్ళు చదువుతారంటావా?

రామం:- ఏం?

సుశీ:- అదికాదు, ఎప్పుడూ అన్నయ్య పుస్తకం ఎదట కూర్చొని అలానే చూసి ఆకాగితం త్రిప్పేస్తుంటాడు కదా? మరి చదవటమెప్పుడు?



రామం:- అవునేవ్, బలే తమాషాగా ఉంటుంది. ఒకరోజున నేను మాట్లాడకుండా అలానే చూస్తూ కూర్చున్నాను. పేజీ తరువాత పేజీ తిప్పట మేనే-అన్నయ్య పని.

సుశీ:- నవ్వు చూశావో లేదో కాని, అక్కయ్య కూడ అంతే రోయ్.

రామం:- కాదులే, పెదిమలు కదుపుతుంటుంది.

సుశీ:- మఱైతే అన్నయ్యో!

రామం:- ఏమో! అదే నేనాకూ తెలియకుండా ఉంది.

సుశీ:- (కొంచెం సేపాలోచించి) ...మనం కూడ అలానే చేస్తే?

రామం:- నీముఖం లాగుంది. అసలు నువ్వు నోరు మూసుకుని చదవగలవా?

గోపీ:- (నవ్వుతూ) బలే! ఇంకా నయం! నోరు మూసుక్కాక పోతే నిద్రపోతూ చదవమన్నావు కావు!

రామం:- మరింకేం! అన్నయ్యకైతే అలవాటు-నువ్వు-నేనూ అలా

నెలజీతం రాగానే కొత్త చెప్పులు కొనుక్కొందా మని పెద్ద షాపులోకి వెళ్లాను. ఆ షాపు కుర్రాడు ఏవో చెప్పుల జతలు తీసి నా కాలికి తొడిగి చూస్తున్నాడు.

ఇంతలో మహా స్థూలకాయుడు ఒకాయన దొర్లుకొంటూ, దొర్లుకొంటూ ఆ షాపులోకేవచ్చి, నా ప్రక్కగా వున్న కుర్చీలో కూలబడి “యిస్సో...అస్సో’ అంటున్నాడు.

“ఏం కావాలండీ?” అంటూ మరో కుర్రాడు ఆయన దగ్గరకు వెళ్లి అడిగాడు.

“ఆఁ!...ఏమీ అక్కర లేదు. నా బూట్ దారాలు వూడిపోయాయి. అవికాస్త ముడివేసిపెట్టు” అని అడిగాడు ఆ మహాకాయుడు.

# ★ చదువుకొనే గది ★

చదవగల మేంటి? అక్కే చదవ లేదు, పెదిమెలు కదుపుతుంటుంది.

సుశీ:- ఔను, నిజమే, ‘రెండో కట్ల రెండు’ అని గట్టిగా పదిసార్లు చదివితేనే గాని నాకు రాదు. తస్సాదియ్యా! ఆపద మూడో ఎక్కం గొంతు చించుకున్నా రావడం లేదురా! అందుకే అన్నయ్య కోప్పడ్డాడు.

రామం:- లేకపోతే ఒకపని చేద్దాం. కొంత సేపటివరకు చదివి వాళ్లు యిద్దరూ నిద్రపోతారు కదా! ఆ తరువాత మనం నిద్రలేచి చదువుదాం.

సుశీ:- ఈ ఉపాయం బాగానే ఉంది కానీ, యిందులో చాల చిక్కులున్నట్టు కనిపిస్తున్నాయి.

రామం:- ఏం చిక్కులు?

సుశీ:- మనం లేవడ మెలాగ?

రామం:- ఓస్! తేగలు తిన్నట్టే ఉంది నీ తెలివి. అలారం లేదా?

సుశీ:- ఆఁ ... అవును. మరి వాళ్ళెప్పుడు పడుకుంటారో మనకెలా తెలుస్తుంది. ఎన్ని గంటలకి అలారం పెడ్తావు?

రామం:- అరెరే! అవును, అది కుదరదు. పోనీ వాళ్ళు పండుకొనేటప్పుడు మనని లేపమని అడుగుదాం.

సుశీ:- అబ్బో, వాళ్లామనని నిద్రలేపేది? మన మెలాగూ గట్టిగా చదివి వాళ్ళను నిద్ర పోనీయకుండా చేస్తామని మరి మాట్లాడరు.

రామం:- గట్టి చిక్కేనే! పోనీ- ఎప్పటికో అప్పటికి అలారం పెట్టేద్దాం.

సుశీ:- (ఆలోచించి) ... మరి అన్నయ్యా, వాళ్ళు లేవడానికో? వాళ్ళు మార్చేస్తారేమో?

రామం:- అబ్బ! అన్నీ చిక్కులేనే!... ఉండుండు....ఆఁ! ...బలే ఉపాయం తట్టింది. నేను నిద్ర పోతున్నపుడు, అటూ - ఇటూ దొర్లుతుంటాను కదూ! అమ్మ చెబుతుంటుందీ...

సుశీ:- ఊఁ! అయితే?

రామం:- ఇప్పుడు విను. నా జుట్టుకి ఒక పొడుగాటి త్రాడు కడదాం. దాని చివరికొన ఒక కుర్చీ కాలుకి కట్టేదాం. అపుడేం జరుగుతుందో తెలుసా?

సుశీ:- (నవ్వుతూ)...ఊఁ... చెప్పు.

రామం:- (తనూ నవ్వుతూ) అప్పుడు నేను దొర్లుతా ననుకో- ఆత్రాడు గట్టిగా లాగుతుంది... ఏం?... ఇట్టే తెలివొచ్చేస్తుంది... బాగాలేదూ?

సుశీ:- బలే బాగుంది ఇక దీనికి తిరుగులేదు.

రామం:- కదూ?

సుశీ:- ...కాని, నువ్వు కుర్చీ వైపుకే దొర్లుతావనుకో, అపుడేం లాభం? త్రాడు నీకేచుట్టుకుంటుంది.

రామం:- ...అవునే! ... చిక్కుగానే ఉంది.

సుశీ:- అందుకే! చెప్పానుగా! వీళ్ళ దగ్గిర ఎలాగూ లాభం లేదు- ఒకవేళ ఎలాగో లేచి చదువు మొదలెట్టినా, ఆగొడవకి ఎవరో ఒకరు లేచి ఒక్క మొట్టికాయ మొడతారు.

రామం:- నిజమే... ఆ అక్క ఉంది చూశావ్, దాని చెవులు ఇట్టె మెదులుతుంటాయి. సూది క్రిందపడ్డా దానికి మెళుకువ వస్తుంది. అందుకే అమ్మకూడా అంటుంటుంది, దానివి పాము చెవులని.

సుశీ:- పోనీలే, నాన్నగారి గదిలో చదువుకుంటే సరి, ఇకే బాధా ఉండదు!

రామం:- అది నిజమే అనుకో. అయినా అక్కడ చదవటం ఏం



'శంకర్స్ వీక్లీ' నిర్వహించిన అంతర్జాతీయ శిశుచిత్రకళ పోటీలో (8-5 సం||ల గ్రూపులో) బహుమతిపొందిన చి|| చామకూర సిరిదేవి, మద్రాసు.

మజాగా ఉంటుందీ? ఇది ప్రత్యేకంగా చదువుకొనే గది. చదువుకొనే గదిలో చదువుకుంటేనే బాగుంటుంది కానీ అక్కడా యిక్కడా చదువుకొంటే ఏం బాగుంటుందీ?

సుశీ:- అవుననుకో. మరి మనమేం చేస్తాం? వాళ్ళ పరీక్షలైపోతే ఇక మనదేగా ఈగది.

రామం:- నాన్నగారి దగ్గర చదవడం నాకు భయం బాబూ! మొన్న నేదో తప్పు చదివానని తిట్టారు.

సుశీ:- నీది మరీ చోద్యంరా. ఇంతకంటె మంచిఉపాయంఇక లేదు.

రామం:- (ఉక్రోషంతో) ఏడిశావులే, చోద్యమట—అబ్బాయికి!

సుశీ:- అదేమిటిరా తిట్టేస్తున్నావ్ సరదాగా అంటేను?

(ఇంతలోవాళ్ళమ్మప్రవేశిస్తుంది)

తల్లి:- ఏమిట్రా మీ అల్లరి. ఆకతాయి వెధవలు, మీరు కూడా ఇక్కడెందుకు-మహా చదివే వారిలాగా?

రామం; సుశీ:- అది కాదే అమ్మా, మాకు కూడా పరీక్షలేనే.

తల్లి:- అవ్వ! అలా అని ఇక్కడఒకటే గోల చేస్తున్నారా? అందుకే వాళ్లు అలా మొత్తుకుంటారు. మీ సంగతి అన్నయ్య నాన్నగారితో చెప్పాడులే!

సుశీ:- నిజంగానా అమ్మా!

తల్లి:- ఇంకా నిజంగానా అంటున్నావా. మీ నాన్నగారు చెప్పారు-ఇక మీరీ గదిలోనికి రావడానికి వీల్లేదు. మీ మాష్టారును కనుక్కున్నారట. ఎప్పుడో ఏప్రిల్ నెలాఖరున కానీ మీ పరీక్షలు వుండవట. (టేబిలు మీద ఉన్న ఫ్లాస్కు తీసుకుని) చక్కగా మీ నాన్నగారి ప్రక్కనే పక్క వేస్తాను, హాయిగా పడుకొని నిద్రపోండి. మీకెందుకీ బాధ. అన్నయ్యకు పెద్ద పరీక్షలు కాబట్టి వాడు రాత్రీ, పగలూ చదవాలి. మీకా దిగులక్కర్లేదు. ఏం?... అలా చేయండి. పోయి ఆడుకోండి.

(అని ఫ్లాస్కు తీసుకుని వెళ్ళిపోతుంది)

సుశీ:- అమ్మ కూడా వాళ్ళతోనే చేరినట్టుంది రోయ్!

రామం:- అసలు వాళ్ళంతా ఒకటేనే బాబూ!

సుశీ: అయినా, ఇక మనకేం? ఏమీ చదవ నక్కర్లే దందిగా! చదువుకో నక్కరలేనప్పుడు చదువుకొనే గదితో మనకేం పని; రా హాయిగా పండుకుందాం.

రామం:- అవును అదే నయం! వెంటనే చెప్పినమాట విన్నామని తమ్ముడి బిస్కట్లలోవి రెండేసి పెడుతుంది కూడాను. పద! పోయి ఆడుకుందాం!

(వాళ్లు వెడుతూ వుండగా తెర పడుతుంది) ★







# జంతుకోటిలో మానవలక్షణాలు



(గతసంచిక తరువాయి)

అడవుల్లో బ్రతికే జంతువు ఎప్పటికప్పుడు ఆహార సేకరణ కోసం క్రొత్త పద్ధతులు వెదుక్కోవలసి వుంటుంది. అలాగే యితర జంతువుల వల్ల రాగల అపాయాన్ని తప్పించుకోవటం కోసం కూడా జంతువులు క్రొత్త క్రొత్త ఎత్తులు వేయవలసి వుంటుంది. సర్వకాల సర్వావస్థలలోనూ యిలా బుర్రకు పనికల్పించే వాతావరణంలో బ్రతకట మనేది ఏ జీవికైనా ఒకింత కష్టమే అయినప్పటికీ, దానివల్ల మేలు మాత్రం ఒకటి ఉంది. అలాటి వాతావరణంలో బ్రతికే జంతువు ఏదైతే వుంటుందో, దానికి స్వతస్సిద్ధంగా వున్న తెలివితేటలు అభివృద్ధి అయితీరుతాయి.

మనుష్యులు మచ్చిక చేసుకొన్న జంతువులకు వాటి తిండి విషయంలోనూ, రక్షణవిషయంలోను ప్రతి జాగ్రత్తా ఆ మనిషే తీసుకొంటాడు కాబట్టి ఆ జంతువు యిక దాని తెలివితేటలను వుపయోగించ వలసిన అవసరం తప్పిపోతుంది. అందుచేత వాటికి సహజంగా వుండే ఆ కొద్దిపాటి తెలివితేటలు కూడా కుంచించుకుపోతాయనటంలో అనుమానం ఏమీ లేదు.

ఈ విషయాన్ని ఋజువుచేయటానికి ఒక్క ఉదాహరణ—కుక్కలను ఏనాటినుంచో మనుషులు మచ్చిక చేసుకొన్నారుకదా? అయినప్పటికీ బస్తీలలోయింటిపట్టునవుండే కుక్కలకంటే, కొండల్లో గొల్లకాపురలకు తోడుగావుండే కుక్కలు, వేటకుక్కలు చాలా తెలివితేటలుగా మసులుకొంటాయి. (మన మనుష్యుల్లోకూడా మరొక వుదాహరణ చూపిగచవచ్చు. వస్తులు పడుకొనేదశలో వుత్తమమైన కళారచనలు గావించిన కళాకారులెందరో, పరాయివారి ఆదరణ ఆశ్రయం లభించగానే, కళవిషయం విస్మరించటమో లేక ఆకళారచనలలో పూర్వపు పట్టుదల తగ్గించుకోవటమో జరుగుతూ వుంటుంది. కాబట్టి మనుష్యులకైనా బుద్ధి బాగా పనిచేయాలంటే కడుపులో కాలుతూ వున్నప్పుడే అది సంభవమని మనం చమత్కారంగా చెప్పకోవచ్చు.)

అడువుల్లో బ్రతికే జంతువులన్నిటిలోకీ తోడేళ్ళకి తెలివితేటలుజాస్తి. ఇవి ఒంటరిగా కాక మందలుమందలుగా చేరి దుప్పులనీ, కణితులనీ తరుముకొంటూ పోయి, చంపితింటాయి. అమెరికా అడవుల్లో తోడేలుజాతికి చెందిందే 'కియోటీ' అనే ఒకరకం జంతువు వున్నది. దీనికి వుండే తెలివితేటలు అమోఘం. ఎలాంటి ప్రతికూల పరిస్థితిలోనైనా యిది తన పబ్బం గడుపుకుపోగల మేధావి. వీటికి ముఖ్యాహారం కుందేలు మాంసం అయినప్పటికీ యివి ఏదిపడితే అది తినేస్తాయట. ఇటీవల ఏదో సందర్భంలో శాస్త్రజ్ఞులు 15 వేల 'కియోట్ల'పొట్టలు కోసి చూస్తే, మోటారు టైరుముక్కలు, లాగూబొత్తాలు, కప్పపిల్లలు, అడివిపిల్లులు, గొల్లభామలు, తాబేళ్లు, ముళ్లపందులు వగైరా వస్తుసముదాయం అంతా బయటపడిందట.

ఈ 'కియోట్లు' ను వలలో వేయటం మహాకష్టం. ఎన్నిరకాల వలలు వేసినా కూడా యీజంతువు తను అందులో పడకుండా తప్పించుకోవటమేకాక, ఆవలనుకూడా ధ్వంసం చేసేస్తుంది. ఇంత తెలివితేటలుగల యీ జంతువుతో మనుష్యులు వేగలేక చాలా సతమత మైనారు. చివరకు ఎవరో ఒక వేటగాడు దీన్ని పట్టేందుకు ఒక చిన్న కిటుకు కనిపెట్టాడు. ఈ జంతువుకి యింత పెద్దబుర్ర వున్నప్పటికీ, దాంట్లో కుంకుడుగింజంత చిలిపితనం కూడా యిమిడివుంది. ఆ విషయం కనిపెట్టిన యీ వేటగాడు ఒక చోట నేలలో చిన్నగుంటతీసి, అందులో ఒక అలారం గడియారం పాతిపెట్టి, ప్రక్కగానే వలపన్నేసి తాను తప్పుకొన్నాడు. కొంతసేపటికి అలారం మ్రోగడం మొదలైంది. ఆచుట్టుపట్ల తిరుగుతున్న 'కియోటీ' యీ చప్పుడు ఎక్కణ్ణించి వస్తోందో తెలుసుకోవాలన్న 'దురద' కొద్దీ అక్కడకు వచ్చి వలలో చిక్కుకుపోయింది. అంటే ఎక్కడ ఏ కొత్త శబ్దం వినవచ్చినా, ఏకొత్త వస్తువు కనిపించినా, అది ఏమిటో తెలుసుకొనే దాకా దీని మనస్సు వుండబట్టదు. ఇలాంటి లక్షణం వున్నందువల్ల ఫలితాల మాట ఎల్లావున్నా, అది మేధావుల లక్షణం మాత్రం అవును.

'కియోటీ' తెలివి తేటలను గూర్చి పరిశోధనలు చేసిన వారిలో ప్రొఫెసర్ జె. ఫ్రాంక్ డోబీ అనే ఆయన అమెరికాలో వున్నాడు. ఈయన కొన్ని సంవత్సరాలపాటు ఎన్నో పరిశోధనలు జరిపి, వీటికి దొంగవేషాలు వేయటంలోనూ, యితర జంతువులను వేళాకోళంచేసి ఏడ్పించటంలోనూ, యితర జంతువుల అరుపులు అనుకరించటంలోనూ, ఒక జట్టుగా ఏర్పడి యితర అల్పజీవాలని చీల్చిచండాటంలోనూ విపరీతమైన నేర్పు వుందని బయటపెట్టాడు.

జట్లుజట్లుగా చేరి వేటాడటంలో 'కియోటీ'లు చాలా గొప్ప పథకాలు వేయగలవు. మాటవరసకు యివి ఒక దుప్పిని వేటాడుతున్నావనుకోండి. పది కియోట్లూ కట్టకట్టుకు ఆదుప్పి వెనకాలపడి పరిగెత్తి అన్నీ ఒక్కసారిగా అలిసిపోవు. ఒక 'కియోటీ' ముందుగా దుప్పిని చూసి తరమటం ప్రారంభిస్తుంది. మరొక 'కియోటీ' కనుపించేవరకు యిది తరుముకు పోయి, అక్కడ తాను దిగబడి పోతుంది. కొత్తగా కనిపించిన 'కియోటీ' దుప్పిని తరుముకు పోతుంది. అలా ఒకదాని తరువాత ఒకటిగా అంచెలు అంచెలుగా, యివి ఆదుప్పిని తరుముతూ వుంటాయి. తరిమే జంతువు ఎప్పటికప్పుడు మారుతూ వుండడంచేత, తరుమబడే జంతువు ఎప్పటికో ఒకప్పటికి అలసిపోయి వీటికి చిక్కిపోక తప్పదు.

ఇవి తిండి సంపాదించేమార్గాలు యింకా విచిత్రంగా వుంటాయి. చలికాలంలో మంచు ఎక్కువగా పడేప్రాంతంలో అయితే, కలుగుల్లో బ్రతికే ఎలుకలు పందికొక్కులు కంటబడవు. అందుకని యివి సామాన్యంగా ఆరోజుల్లో గడ్డిమేసి బ్రతికే ఏ ఎద్దునో అంటిపెట్టుకు తిరుగుతుంటాయి. ఎద్దు తనకు కావలసిన పచ్చగడ్డికోసం కాలిగిట్టతో మంచు ముద్దలను పగలగొట్టుతుంది. పైమంచుగడ్డ పగిలిపోగానే భూమి కలుగుల్లో కాలక్షేపం చేస్తూవుండే జీవాలన్నీ ప్రాణభీతితో పైకి ఎగిరిపడుతుంటాయి. అలా పైకి ఎగిరివచ్చిన ప్రతిజీవాన్నీ, ఆ ఎద్దును అంటిపెట్టుకు తిరుగుతూ అందే పొంచివుండే యీ 'కియోటీ' పొట్టను పెట్టుకొంటుంది.

మామూలుగా ఎలుకల్నీ, కుందేళ్లన్నీ తిని బ్రతికే యీ కియోటీలు యిటీవల ఆవుదూడలను కూడా తినేస్తున్నాయట. దీన్ని గురించి అమెరికాలో రైతులు యిటీవల చాలా ఆందోళన కూడా పడ్డారు. ఆవుమాంసం అంతకంతకూ రుచికరంగా తయారు కావాలన్న ఆశకొద్దీ, అమెరికాలో గొడ్లకావరులు ఆవుల పెంపకం పద్ధతులు, దానిమేత మార్చేశారు. తత్ఫలితంగా అంతకు పూర్వం తన లేగదూడకు హాని తలపెట్టిన వారిపై తిరగబడే ఆవు, యిప్పుడు ఆ పని చేయలేక పోతున్నది. ఆవులకి మనుష్యులు ఆపాదించిన యీ దౌర్బల్యాన్ని కనిపెట్టిన 'కియోటి', యిటీవల లేగదూడల మీదికి ఒంటికాలితో ఎగురుతున్నది.

(ఇంకావుంది)

# ★ విచిత్ర వ్యక్తి ★

(33–వ పేజీ తరువాయి)

వును, ముక్కుపచ్చలారని ఈ ఇద్దరు పసిగండులను కూడా ప్రలోభపరచింది. ఈ బంగారు నాణేలకే గనక నోరుంటే తాము ఒక మత గురువును కూడా లొంగదీసుకున్నందుకు గర్విస్తున్నామని తప్పక చెప్పగలవు."

న్యాయవాది కూర్చున్నాడు. విల్హెల్మ్ లేచాడు.

"ఈ డబ్బు రెండేళ్ల కిందట రోడ్డుమీద తనకు దొరికిందని ఫిర్యాది చెబుతున్నాడు. అంతేగదండీ?" అని విల్హెల్మ్ జ్యోతిష్కునికేసి తిరిగి అడిగాడు. జ్యోతిష్కుడు అవునన్నాడు.

"ఆవిధంగా దొరికిన ధనం ఒకానొక దినం వరకూ అంటే గత డిసెంబరు మాసం ఆఖరు తేదీ వరకూ తనవద్దనే ఉందనికూడా ఫిర్యాది చెప్పాడు. అంతేకదండీ?" అని మళ్ళీ అడిగాడు. జ్యోతిష్కుడు మళ్లీ తల ఊగించాడు. విల్హెల్మ్ జడ్జీలకేసి తిరిగి "కోర్టులో హాజరు పరచబడిన ధనమున్నూ, ఫిర్యాదికి దొరికిన ధనమున్నూ ఒకటి కాదని నేను నిరూపిస్తే ఈ ధనం ఫిర్యాది ధనం కాదని ఋజువైనట్లే కదా?" అన్నాడు.

"అవును. కాని అదెలా కుదురుతుంది? మీకు కొత్తసాక్షు లెవరైనావుంటే ముందుగానే మాకు తెలియపరచవలసివుంది," అని ఒక జడ్జీ అని మిగతా జడ్జీలతో ఏదో సంప్రదించసాగాడు. ఈ లోగా ప్రతిపక్షపు న్యాయవాది కోపంతెచ్చుకుని లేచి, ఇప్పుడు కొత్త సాక్షులను ప్రవేశపెట్టడం అన్యాయమని వాదించాడు.

"నేను ప్రవేశపెట్టబోయేది కొత్త సాక్షినికాదు, పాత సాక్షినే. ఆ సాక్షిని కోర్టువారు కొంతవరకూ పరీక్షించారు కూడాను," అన్నాడు విల్హెల్మ్.

"ఎవరది?"

"ఈ ధనమే."

"ఈ ధనమా? ఈ ధనం ఏమిచెబుతుంది?"

"ఏమి టేమిటి? ఏదైనా చెబుతుంది. జ్యోతిష్కుడికి దొరికిన డబ్బు తనుకాదనీ, జ్యోతిష్కుని వద్ద నుండి డబ్బుపోయిన తర్వాతే తను పుట్టాననీ చెబుతుంది. మాటల్లో చెప్పలేకపోయినా, తనమీద గల సంవత్సరం సంఖ్య ద్వారా సాక్ష్యం చెప్పగలదు."

కోర్టులో పెద్ద అలజడి చెలరేగింది. ప్రతి పక్ష న్యాయవాది, జడ్జీలు కంగారుపడి గబగబ నాణాలుతీసి పరిశీలించారు. "అరె! అరె!" అని విస్తుపోయారు. "నిజమే, నిజమే" నన్నారు. అందరూ విల్హెల్మ్‌ను ఒకటే మెచ్చుకోవటం మొదలెట్టారు. అతనికి అంత మంచి ఆలోచన, ఎవరికీ తట్టనిది తట్టినందుకు ఆశ్చర్యపడ్డారు. చివరికి న్యాయమూర్తులు ఇలా తీర్పు ఇచ్చారు.

"ఈ బంగారు నాణాల్లో నాలుగు తప్ప మిగతా వన్నీ కొత్త సంవత్సరంలో ముద్రించబడినవే. కనుక కోర్టువారు, అమాయకుడు, నిర్దోషి అయిన ముద్దాయికి తమ హృదయపూర్వక సానుభూతి తెలుపుతున్నారు. దురదృష్టవశాత్తు జరిగిన పొరపాటువల్ల ఆయనకి కష్టం కలిగించినందుకు విచారిస్తున్నారు. కేసు కొట్టివేయడమైనది."

జనం అంతా లేచి ఇవతలకొచ్చారు. మార్గరెట్‌ను అభినందించారు. తరువాత విల్హెల్మ్‌ను అభినందించారు. ఈలోగా సైతాను విల్హెల్మ్‌లోనుంచి ఇవతలికొచ్చి నుంచున్నాడు. జనం అతనిగుండా నడిచి పోతున్నారు, అక్కడ ఏమీ లేనట్టే.

విల్హెల్మ్ తనకు నాణాలమీద అంకె సంగతి ఎలా తట్టిందో తనకే తెలియటం లేదన్నాడు. తనకు ఆ నాణాలు ఏ సంవత్సరానివో అదివరకు తెలియకపోయినా, ఆక్షణంలో తెలిసినట్టు అనిపించిందన్నాడు. విల్హెల్మ్ మంచివాడు గనక ఆమాట అన్నాడు. ఇంకొకడైతే తనకు మొదటినుంచీ తెలుసుననీ, గమ్మత్తుచేద్దామని చివరిదాకా బయటపెట్టలేదని కోతలుకోసేవాడే.

సైతాను ఇవతలకు రాగానే విల్హెల్మ్ తేజస్సు తరిగి మామూలు మనిషి అయ్యాడు. మార్గరెట్ అతన్ని మెచ్చుకుని 'నిన్ను చూసి గర్విస్తున్నాను,' అన్నది. ఆముక్క విని మళ్లీ అతనికళ్లలోకి ఇందాకటి

తేజస్సు వచ్చింది. జ్యోతిష్కుడు నేల మట్టానికి కుంగి పోయి, తనలో తను తిట్టుకుంటూ వెళ్లిపోయాడు. సాలమన్ ఐజాక్స్ డబ్బు తీసుకుని వెళ్లిపోయాడు. ఇప్పుడా డబ్బు ఫాదర్ పీటర్ దే ననటంలో సందేహం లేదు.

సైతాను మాయమయ్యాడు. బహుశా ఖైదీకి విడుదల వార్త చెప్పటానికి జైలుకి వెళ్లివుంటాడను కున్నాను. మార్గెట్, మిగతావాళ్లం అందరం కలిసి జైలుకి వెళ్లాము.

ఈలోగా సైతాను అక్కడ చేసింది ఇది; ఫాదర్ పీటర్ కు కనిపించి "విచారణ పూర్తయింది. నువ్వు దొంగవని తీర్పు చెప్పారు," అన్నాడు. ఇది విన గానే పాపం ఫాదర్ పీటర్ మతి చలించింది. మేము వెళ్లేటప్పటికి పూర్తిగా పిచ్చివాడై పోయాడు. జైలు గదిలోనే అటూఇటూ పచార్లు చేస్తూన్నాడు. తానొక సార్వభౌముడినని భావించుకున్నాడు. కాపలా వాణ్ణి ద్వారపాలకుడుగాను, జైలుఅధికారిని మంత్రిగాను, భావించుకుని వారికి ఏవేవో ఆజ్ఞలిస్తున్నాడు. అతని ముఖంలో అదివరకెప్పుడూ కనబడని ఆనందం వెల్లి విరుస్తోంది. భూలోకంలో తనంత గొప్పవాడు, భాగ్యశాలి లేడని గర్వంగా ఉన్నాడు.

(ఇంకా వుంది)

# ★ గాను గెద్దు ★

(35-వ పేజీ తరువాయి)

కొంతసేపయాక చెరో ప్రక్కనా పడి సొంతం నిద్రపోయారు. ఈ గానుగెద్దు నడచినంత సేపూ నడిచి దాని పాతఅలవాటు ప్రకారం, వారు చేరుకోవలసిన బస్తీకి మూడు మైళ్ల ఇవతల గానుగ తిరిగినట్లు తిరగడం ప్రారంభించిందట!

అప్పటికి దాదాపు తూరుపు తెల్లవార వస్తోంది - తాసీల్దారు గారికి కొంచెం మెలకువ వచ్చినా బండి కదుల్తోనే ఉండడంచేత ఇంకా బస్తీకి చేరుకో లేదుగదా అనే ధైర్యంతో మళ్లీ కాస్త కునుకు పట్టించుకొన్నారుట. ఈ ఎద్దు మాత్రం అలాగే గుండ్రంగా గానుగ తిరుగుతూనే ఉంది; కానీ ఈవిషయం సాయిబు గాని, తాసీల్దారుగారు గాని గమ నించనే లేదు!

ఇంతలో తెల్లారి పోయింది! తీరా చూస్తే ఆబండి అక్కడే "అల్లీ బిల్లీ" తిరుగుతోంది- దాని అలవాటు ప్రకారం! తాసీల్దారు గారికి గుండె బద్దలై నంతపనైంది; తను కలెక్టరుగారిని చూసేవేళ మించిపోయినందుకు. బండిసాయబునూ మునసబుగారినీ నాలుగు తిట్టి బండి గబాగబా తోల మనీ ఆఖరికి అది సరిగా నడవక పోతే కాలినడకనేపోయి కలెక్టరు గారిని కల్సుకొన్నారట!!

అలానే మన పప్పు రాము డున్నాడే—వీడు, సంవత్సరం పొడుగునా, మిగతా పిల్లల కంద రికీ పాఠాలన్నీ ఐపోయినా, వీడు మాత్రం మొదటి పాఠమే చదువు తూ వుంటాడు. అందుకనే యిలాంటివాళ్లను 'గాను గెద్దు' లంటారు"

పిల్లలందరూ, గల్లంతుగా నవ్వేరు. పప్పురాముడుమాత్రం మూతి బారెడు పొడుగు చేసుకొని తల వొంచుకు ముంగిలా మూలను కూర్చున్నాడు. వాడి వాలకం చూసి పిల్లలమందరమూ మరీ నవ్వేశాం!



"మొన్న ఒక యింగ్లీషు పత్రికలో సిగరెట్లు కాల్చి నందువల్ల కలిగేనష్టాలు ఏవేవి వున్నాయో, అదంతాఏకరువు పెట్టుతూ ఎవడో ఒక మంచి వ్యాసం వ్రాశాడు" అన్నాడు ఒకరైలు ప్రయాణీకుడు, తన ప్రక్కన వున్న ఒక వ్యక్తితో-ఏదో మాటల సందర్భంలో.

"అయితే మీరు సిగరెట్లు మానేస్తారా ?" అని అడిగాడు ఆవ్యక్తి.

"మానెయ్యను-ఇకమీదట యింగ్లీషుపత్రికలు చదవటం మాత్రం మానేస్తాను." అన్నా డు. ఆబుద్ధిమంతుడు.



"పుట్టిల్లు"లో నర్సువేషంలో జమున.

ఢుండీరాజ్ గోవింద్ ఫాల్కే ఏప్రిల్ 30 తారీఖున 1870వ సంవత్సరంలో బొంబాయిలో వున్న ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలో పని చేయుచున్న సంస్కృత పండితునకు పుత్రుడై జన్మించాడు స్వస్థలం నాసిక్. చిన్నతనంనుండి చిత్రకళలో ఎక్కువ శ్రద్ధ చూపుతూ వుండేవాడు ఈ కళాభిమానమే అతన్ని జె. జె. ఆర్టుస్కూల్లోను బరోడా కళాభవనంలో విద్యార్థిగా చేర్పించింది ఈ కళలో పరిపూర్ణజ్ఞానం సంపాదించాక ఫొటోగ్రఫీలోను, ఎంగ్రేవింగులోను అభిలాష కలిగింది. సాధ్యమైనంతవరకు ఈ రెండు విద్యలలోను జ్ఞానం సంపాదించ గలిగాడు.


శ్రీ వి. వి. యస్. ఆర్.
హనుమంతరావు


ఆ రోజుల్లో పాశ్చాత్య ఫిలింలు మన దేశంలో చూపబడుతూ వుండేవి ఫాల్కే జీసస్ క్రీస్తుయొక్క ఫిలిం చూడ్డం తటస్థించింది ఆ ఫిలిం అతడెన్నో మార్లు చూచాడని ఆయన్ని ఎరుగున్నవారంటారు. ఈ చిత్రం చూచేసమయంలో ఆయన మన స్వంతా చిత్ర పరిశ్రమపై లగ్నమై క్రీస్తు చిత్రంలా శ్రీకృష్ణుని ఫిలిం ఎలా తియ్యడమా అని ఆలోచన లనేకమైనవి తట్టేవి చిత్ర నిర్మాణకళలో జ్ఞానం సంపాదిస్తే నే గాని ఇది సాధించలేని పనని తెలిసికొన్నవాడై యూరప్ వెళ్ళి ఆకళలో అనుభవం సంపాదించాలని స్థిరపరచుకొన్నాడు అంత ధనవంతుడు కాకపోవడంవల్ల తన ఆస్తిని, ఇన్స్యూరెన్సు పాలసీని తాకట్టుపెట్టి పదివేలరూపాయలు పట్టుకొని, 1912వ సంవత్సరం ఫిబ్రవరినెల 2వ తారీఖున యూరప్ వెళ్ళాడు

అక్కడ కొద్దిరోజులుండి, చిత్రాలు తయారుచేసే కళలో జ్ఞానంసంపాదించి, మాతృదేశానికి తిరిగి ప్రయాణమయ్యేడు. వచ్చేటప్పుడు తనతో విలియం సన్ కెమెరా నొకదాన్ని పెరఫొరేటర్, ప్రింటింగు మెషిన్ నొకదాన్ని తేగలిగాడు; ఈ పరికరాలతో తన మాతృదేశంలో చిత్ర నిర్మాణం సాగిద్దామన్న కోరికతో.

తిరిగి తన దేశం వచ్చాక, స్వగ్రామమైన నాసిక్‌లో ఫాల్కే ఫిలిం కంపెనీని స్థాపించాడు. పురాణగాథల నెన్నుకొని చిత్రనిర్మాణం సాగించాడు. ప్రప్రథమంలో 'రాజహరిశ్చంద్ర' అన్న చిత్రాన్ని 1912వ సంవత్సరంలో తయారుచేశాడు. ఈ చిత్రాన్ని, ఆ సంవత్సరాంతమందు బొంబాయిలో వున్న కారొనేషన్ థియేటరులో ప్రదర్శించారు.



ఆర్. కె. ఫిలిమ్స్‌వారి "ప్రేమలేఖలు"లో రాజకపూర్.

హిందూదేశంలో తయారు కాబడిన ప్రథమ చిత్రానికి అమిత ఆదరణ కలిగింది చిత్రంమీద డబ్బు బాగానే వచ్చింది. ఈ చిత్రం 3,700 అడుగులు నిడివి కలదై చూచినవారికెంతో ఆనందం కలిగించింది.

తమ దేశీయుడు తయారుచేసిన చిత్రం, తమకు బాగా తెలిసివున్న పౌరాణిక కథ కాబట్టి ఈ చిత్రం చూపించిన ప్రతిచోట డబ్బు బాగా వచ్చింది ఇంతటితో ఆగక, ఫాల్కే అనన్య సామాన్య ప్రజ్ఞ అన్నిదిశల వ్యాపింపసాగింది.

ఈ సందర్భంలో ఒక చిన్న విషయం గుర్తించాలి. రాజహరిశ్చంద్ర తీసిన సమ

# దాదాసాహెబ్ ఫాల్కే

యానికే యూరప్‌లో, అడాల్ఫ్ జుకోర్ (*Adolph Zukor*) 'ఎలిజబెత్ రాణి' అన్న చిత్రాన్ని తీసి ప్రజలకు చూపగలిగేడు. ఈ చిత్రమే యూరప్‌లో తయారు కాబడిన ప్రథమ కథాచిత్ర మవడంవల్ల, అక్కడ, మన దేశంలోను ఈ కథాచిత్ర నిర్మాణం ఒక్కసారే తలెత్తిందని అనక తప్పదు

రాజహరిశ్చంద్ర విజయం ఫాల్కేని మరికొన్ని చిత్రాలు తీసేటట్లు చేసింది 'భస్మాసుర మోహిని', 'సావిత్రి' మొదలైన చిత్రాలను తీసి, అఖండప్రజ్ఞ వెల్లడి చేశాడు. ఈయన తదనంతరం, ఇంగ్లండు దేశం వెళ్ళి తనచే తయారుచేయబడ్డ చిత్రాలను అక్కడ ప్రదర్శించాడు. ఇంగ్లీషు ప్రేక్షకులందరూ, ఆ చిత్రాలను చూచి ఆనందించి, ఫాల్కే ప్రజ్ఞ ననేకవిధాల పొగిడారు.

ఫాల్కే 1912-1917 లో పల 23 చిత్రాలు తీయగలిగాడు. 1918 వ సంవత్సరంలో తీసిన 'లంకాదహనం', 1919 లో తీసిన 'కాళీయమర్దన్', 1928 లో తీసిన 'సతీమహానంద', 'సేతుబంధన్' మొదలైన చిత్రాలు ఈ మహనీయుని చిత్రనిర్మాణ ప్రజ్ఞ వలీశల వెదజల్లాయి



అరుణావారి "గుమస్తా"లో రామశర్మ, పేకేటి శివరాం.



అసోసియేటెడ్ ప్రొడ్యూసర్స్ అరవం, మలయాళం భాషల్లో తీస్తున్న ఒక చిత్రంలో సత్యం, బి. ఎస్. సరోజ, మీనాక్షి.

ఫాల్కే చిత్రనిర్మాణం సాగించే సమయంలో ఫిలింపరిశ్రమలో పాల్గొనడమంటే నీచంగా చూడబడేది. అందులో చిత్రంలో నటించడమంటే మర్యాదలేని పనిగా చూసేది లోకం నాటకాల్లో వేషాలు వేసేవారుకూడ ఈ పని ఒప్పుకొనేవారు కారు. అందుచేత ఫాల్కే, చిత్రాల్లో నటించగలిగేవారిని తేవడంకోసం ఎంతో కష్టపడేవాడు. వారి కనేకపాఠాలు బోధించి, అనేకవిధాల ఆదరణ చూపించి, ఎంతో డబ్బు ఖర్చుపెట్టేవాడట. కాళీయమర్దన్‌లో కృష్ణపాత్ర నటించటానికే కుర్రవాడు దొరక్కపోవడంవల్ల తన ముద్దు కూతురైన, మందాకినికే ఈ పాత్ర నిచ్చి, అద్భుతంగా నటింపజేశాడు

చిత్రనిర్మాణంలో అనుభవమున్నవారెవ్వరూ లేకపోవడంచేత అతనికి సహాయం చేయడాని కెవ్వరూ దొరకలేదు ఈ కారణంవల్ల తన భార్య సరస్వతీబాయికి సినిమా కళనంతా నుపదేశించి, ఆమెనే తనకు సహాయకారిగా చేసికొన్నాడు. చిత్రాలకు కథలు తనే వ్రాసేవాడు. డైరక్షన్ తనే ఫొటోగ్రాఫ్‌లు తియ్యడం, ఫిలిం ప్రొసెస్ చెయ్యడం – అన్నీ తనే ఈ కార్యాలన్నిటిలోను అతని భార్యయే సహాయకారి. చిత్రనిర్మాణ సాధనాల్లో

స్త్రీలను ప్రవేశపెట్టి వారిచేతనే పని చేయించిన ఈ మహానుభావు డెన్ని విషయాల్లో ముందంజ వేశాడో గుర్తింపదగిన విషయం.

చిత్రనిర్మాణానికి కావలసిన డబ్బు, తానాటే ధనవంతుడు కాక పోవడంవల్ల చిత్రాలు తయారుచేస్తామనే కోరిక పెద్దగా ప్రోత్సహించడంవల్ల, తన భార్యకున్న నగలుకూడా అమ్మేసి, చిత్రనిర్మాణానికుపయోగించాడు ఇదికూడా చాలక పోవడంవల్ల డబ్బు పెట్టుబడికన్నిదిశలూ ఆత్రుతతో చూచేవాడు ఐనప్పటికి, పెట్టుబడిదార్ల చెప్పుచేతల్లో వుండటానికేమాత్రం అంగీకరించేవాడు కాదు. 'కళ వ్యక్తియొక్క స్వేచ్ఛపై నాధారపడి వుంటుంది గాని, ధనవంతుల నాజ్ఞలపై నుండదని' చెపుతూ తన కృషిని సమర్థించేవాడు పెట్టుబడిదార్లందరూ ఇది 'ఫాల్కే యొక్క తలబిరుసు తనం' అని అంటూ డబ్బు పెట్టుబడి పెట్టడానికి సాధారణంగా అంగీకరించేవారు కారు.

తన చుట్టుపట్ల పరిస్థితులీవిధంగా వుండగా, తక్కిన చోట్లకూడా ఇతనికి పరిస్థితు లనుకూలంగా లేకపోయాయి ప్రథమంలో చిత్రనిర్మాణం మొదలెట్టిన కొద్దికాలానికే యూరప్ దేశంలో ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం ప్రారంభమయింది అందువల్ల చిత్రనిర్మాణానికి కావలసిన పరికరాలు, కెమికల్సు మొదలైన సామగ్రి, ముఖ్యంగా రాఫిలిం తెచ్చుకోడం చాలా కష్టంగా వుండేది కెమికల్సు, పరికరాలు, తనకు దొరికినవాట్లతోనే తన ఊహాప్రజ్జ్వలన, కార్యకలాపాలు జరిపేవాడు, రాఫిలింకూడా ఎలాగో సంపాదించి నిర్మాణం సాగించేవాడు.

ఇన్ని కష్టాల నెదుర్కొని చిత్రనిర్మాణం సాగించిన ఫాల్కే యొక్క చిత్రాలనుగురించి, లండన్ లో నున్న బయోస్కోప్ వారపత్రిక (*Bioscope Wckly*) ఈ విధంగా పొగిడింది

"ఫాల్కే యొక్క చిత్రాలు టెక్నికల్ గా ఎంతో శ్రేష్టమైనవి. జీవితానికి దగ్గరగా సంబంధించిన విషయాలను సూక్ష్మంగా చూడ్డంలోను, వూహించడంలోను అనన్యసామాన్యమైనవి"

ఇట్టి చిత్రాలను, 200 కాపీలు తీసి తమకు పంపించమని కోరుతూ, అమెరికా నుంచి, వార్నర్ బ్రదర్స్ సంగ్రామం ప్రచండత దాల్చడంవల్ల, ఫాల్కే - కాదు భారతదేశ సినిమాపరిశ్రమ - ఈ కోర్కె నెరవేర్చలేక పోవడం జరిగింది. ఒకవేళ ఈకోర్కెయే నెరవేర్చబడివుంటే, భారత చలనచిత్ర పరిశ్రమచరిత్ర ఎట్టి ప్రాముఖ్యత చెందేదో! ఏది ఎలాగైతేనేమి, కథ అలా ఆగిపోయింది

(5 -వ పేజీ చూడండి)



జంపన అండ్ నంది వారి "మేనరికం" తిరిగి ప్రారంభించారు ప్రసిద్ధ ఛాయాగ్రాహకుడు వి. యన్. రెడ్డిగారు కెమేరా లోంచి చూస్తున్నారు అసిస్టెంట్ శ్రీమతి వరలక్ష్మి మీద లైటింగ్ మీటర్ తీసుకుంటున్నారు. ఫైల్ చేత్తో పుచ్చుకుని వున్న బట్టతలాయన కవి, దర్శకుడు జంపన.

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ కందా శ్రీనివాసు—కాకినాడ.

జూపిటర్సు "రాణి", కర్దార్స "జాదు" అనుకరణమని నేను, "దులారి" అనుకరణ మని మా స్నేహితుడు అంటాము. ఏది నిజమో తెలవిస్తారా?

—ఆ 'జాదూ', యీ 'రాణీ' కూడా '*Loves of Carmen*' అన్న యింగ్లీషు చిత్రానికి కాపీ.

* * *

ఎల్. హసన్‌ఖాన్—ద్రోణాచలం.

తెలుగు భాషలో ఇంతవరకు టెక్ని కలర్ పిక్చర్ ఎవరూ తీయటము లేదు? వారిదగ్గర డబ్బు లేకనా? లేక వారి చేత కాకనా?

—రెండూ కారణాలు కాదు. టెక్ని కలర్ చిత్రం తీయటానికి పెద్దఎత్తున పెట్టు బడి పెట్టాలి. అంత పెట్టుబడి పెట్టి తీస్తే, మన తెలుగుదేశంలో వున్న జనాభా అంతా ఒక్కొక్కరు రెండేసిసార్లు ఆ చిత్రాన్ని చూచి ముడుపులు చెల్లించక పోతే, పెట్టుబడిదారుడికి కానీ అయినా గిట్టుబాటు కాదు.

* * *

శ్రీ దేవకి రామసుబ్బారావు—వినుకొండ.

మామూలు పిక్చరు తీసే కెమెరాతో టెక్నికలర్ పిక్చరు తీయవచ్చునా!

—వీల్లేదు. కెమెరాయే కాదు; మామూలు లైట్సుకూడా టెక్నికలర్‌కి పనికిరావు.

* * *

శ్రీమతి అక్కల కమల;—కొండపల్లి.

సినిమా తారలంటే మానము, మర్యాద లేని మానవులంటుంది నా మిత్రురాలు. నిజమేనా మహాశయా!

—మానం, మర్యాదలేని మనుష్యులు సినిమాలోకంలోనే కాక ప్రపంచం అంతటా వుంటారు. అలాంటి వ్యక్తులతో లావాదేవీలు పెట్టుకోనేవారికి వుండవల సిన దిగులు మీ మిత్రురాలికి అనవసరం.

* * *

బి. నరసింహారావు—సికందరాబాదు.

ఒక సినిమాలో బుక్ అయిన నాయకీ నాయకులు ఏదైనా కారణములవల్ల దెబ్బ లాడుకొనిన, ప్రేమఘట్టములలో వారు ఎట్లు నటించెదరు. ?

—ఒప్పుకొన్న కాంట్రాక్టు పాడై పోతుందన్న యావకొద్దీ, వేరే ఆలోచన లేకుండా 'నటించేస్తారు.'

* * *

శ్రీ పసుపులేటి రంగస్వామి!—గుడి వాడ.

'నాయిల్లు'లో శివరాం (నాగయ్య గారు) తాను ఎన్నడు సినిమా స్టారు కానని, తన సంతానాన్ని సంగీతరత్నాలు చేస్తాను కాని సినిమా స్టారులు కానివ్వనని సినిమాలను విమర్శించారు; అలాగే పృధ్వీ థియేటర్సువారి 'ఆహుతి' లో రామకిషన్ (పృధ్వీరాజ్ కపూర్ గారు) పొగతాగుతూ సిగరెట్లు తాగటాన్ని విమర్శిస్తారు, సినిమా లను విమర్శించారు; మరి ఈ పెద్దలు తాము చేసేపనిని ఒక ప్రక్క విమర్శిస్తూ చేస్తుంటారు! దీనిలో ఉన్న చిటంబుర రహస్యము కలవిప్పిస్తారా?

—వారే కాదు: ఏ వృత్తిలో వున్న వారైనా వినేవారువుంటే, తాము ఏవృత్తి మూలంగా జీవిస్తూ వుంటారో, ఆ వృత్తి కంటే హీనమైనది మరొకటి లేదని చెప్పు కొంటూ వుండటం లోకంలో చాలా మామూలుగా జరిగేసంగతి. లోకంలో జరిగేది కనుకనే యీతత్వాన్ని సినిమాల లోనూ, నాటకాలలోనూ ప్రవేశపెట్టటం జరిగివుంటుంది.

* * *

బి. ఎస్. హనుమంతరావు—మద్రాసు

'నాయిల్లు' సినిమాలో సంక్రాంతి వుత్సవాలు రేడియో కేంద్రంవద్ద ప్రసారం చేస్తూ రేడియోలో బాలుడు పాడ మొదలు పెట్టినపాటను యితర రైతులు, గృహిణులు, పల్లెపడుచులు మొదలైనవారు అంతను చేసి నట్లు చూపిస్తారు? అదెట్లు సంభవము?

—సినిమాలో ఎందుకు సంభవంకాగు? మామూలుగా మనం చూసే సంఘటనలకూ, అవి సినిమాలోగాని, ఇతర కళలలోగాని చూపించబడే విధానానికీ భేదం ఉంటుం దని గ్రహిస్తే ఈ ప్రశ్నరాదు.

* * *

డి. నారాయణ—హనుమకొండ.

1952 లో విడుదలైన చిత్రాలలో ఏ చిత్రమును ప్రశస్తమైన చిత్రముగా భావిస్తారు?

—తెలుగు చిత్రాల్లో "పెళ్ళిచేసి చూడు" చిత్రానికే అగ్రతాంబూలం.



విధం చెడ్డ రాఘవరావ్ తనకొడుకు మెడలో వస్తువుపై కన్నేస్తున్నాడు

"పుట్టిల్లు"లో రాజారావ్—జమున.



"కన్నతల్లి"లో జి. వరలక్ష్మి

(47-వ పేజీ తరువాయి)

ఫాల్కే మొత్తం మీద 128 కథా చిత్రాలు తయారుచేశాడు అందులో ఆఖరిచిత్రం 'గంగావతరణం'. చిత్రం అంటే ఏమిటో తెలియనిరోజుల్లో, చిత్రనిర్మాణం గురించి, పరిశీలించి, అవగాహన చేసికొని, అనేక కష్టాల నెదుర్కొని, చిత్రనిర్మాణం సాగించి, 128 చిత్రాలు తయారుచేసి, పాశ్చాత్యులు కూడ పొగడిన ఫిలింలను తయారు చేసిన ఈ మహానీయుని, 'భారత చలనచిత్రపిత' అని అనడం విశేషమైన విషయం కాదు

ఈ 'చలన చిత్రపితని' 1939 లో బొంబాయి నగర ప్రజలెంతయో గౌరవించారు. బొంబాయి గవర్నరు అధ్వర్యం క్రింద నొక బహిరంగసభ జరిపి పదువేల రూపాయిల పరసు (Pors) నొకదానిని బహూకరించారు దాదరులో నున్న వీధి నొకదానికి 'ఫాల్కేలేన్' అని నామకరణంచేసి, ఈ చలనచిత్రపిత నామం మరవడానికి వీలు లేకుండా చేసింది బొంబాయి పురపాలకసంఘం.

ఇట్టి గౌరవాలనన్నిటిని పొంది, ఈ కళాకారుడు, 1944 వ సంవత్సరం ఫిబ్రవరినెల 16 వ తేదీ స్వర్గస్థుడయ్యెను. ఈయన మనకు శారీరకంగా కనబడక పోయినప్పటికి, కష్టపడి గ్రహించిన 'సిని

తన

మాపరిశ్రమ' అనెడి విత్తును నాటి, మొక్కయి, చెట్టయి, నిర్మాణం, అందజేయడం, ప్రదర్శించడం అన్న కొమ్మలనన్ని వైపుల నాక్రమించడానికి కారణభూతుడై, చిత్రనిర్మాణంలో ప్రపంచంలో తన మాతృదేశం రెండవస్థానం ఆక్రమించుకోగల శక్తివంతంగా వుండేటట్లు పునాదివేసిన ఈ మహనీయుని శక్తి మనకండ్లకి కనిపించుతూనే వుంది.

ఈ ఫిబ్రవరి 16 వ తారీఖున ఫాల్కే యొక్క 9 వ వార్షిక వర్ధంతి భారత చలన చిత్ర పరిశ్రమకు పితామహుడైన ఫాల్కేని గురించి, తలంచి, ఆత డొనరించిన కార్యములను, సినిమా పరిశ్రమ కొనరించిన సేవ 'తలపోసి', అంజలి ఘటించడం, సినిమా పరిశ్రమకు చెందిన ప్రతీ వ్యక్తి యొక్క కర్తవ్యం ఈ కృత్యాన్ని నెరవేర్చి, పరిశ్రమ ఈ పితామహు నెడ సానుభూతి సినిమాలోకం చూపుతుందని అనుకోడంలో అతిశయోక్తి లేదు. ★





సాగూర్ సినీ ప్రొడక్షన్సు వారి "అమరకవి"లో త్యాగరాజ భాగవతార్

# సినిమా వార్తలు

వినోదావారి "దేవదాసు" షూటింగ్ చురుగ్గా సాగుతున్నదనీ, ఏప్రిల్ నెలకు ఆఖరవుతుందనీ తెలుస్తోంది. ఇప్పుడు జమీందారు ఇంటిసెట్టుపై పని జరుగుతున్నది. ఇక చంద్రముఖి ఇంటి సెట్టుపై పని, కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలపని, మిగిలివుందట. చంద్రముఖిపాత్రకు ఇంకా ఎవరూ నిశ్చయం కాలేదని తెలుస్తున్నది. నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు, పేకేటి, ఆరణి, చంద్రకుమారి, కొత్త నటుడు జె. వి. జి. కృష్ణ, తదితరులు ఈచిత్రంలో నటిస్తున్నారు.

* * *

రాజకపూర్ తెలుగులో తీస్తున్న "ప్రేమలేఖలు"లో నర్గీస్, రాజకపూర్, ప్రాణ్, విజయలక్ష్మి మున్నగువారు నటిస్తున్నారు. సంగీత దర్శకులు శంకర్, జైకిషన్. ప్లేబాక్ పాటలు జిక్కి కృష్ణవేణి పాడుతున్నది.

శ్రీమతి జిక్కి కంఠం బాగుందని భావిస్తున్న రాజకపూర్ తన హిందీచిత్రాల్లో కూడా ఆమెచేతనే పాడించాలనుకుంటున్నట్లు ఒక వదంతి వున్నది. "ప్రేమలేఖలు" మార్చి నెలాఖరులోగా విడుదల అవుతుందట. డిస్ట్రిబ్యూటర్లు నవయుగ ఫిలిమ్స్‌వారు.

* * *



ప్రకాశ్ ప్రొడక్షన్సువారి "కన్నతల్లి"లో ఆర్. నాగేశ్వరరావు.



'వంశ మర్యాదల కోసం ఆస్తిఅంతా షావుకార్ల పాలైపోగా చెట్టు పుట్ట పాలైపోయిన ధర్మయ్య-భార్య శాంతమ్మ కొడుకు సూర్యం "పుట్టిల్లు"లో మిక్కిలినేని, పెరుమాళ్లు, రమణి.

భానుమతి, అశోక్‌కుమార్ నటించిన హిందీచిత్రం "షంషీర్"ను నవయుగ ఫిలిమ్స్‌వారు వచ్చేనెలలో విడుదల చేయాలనుకుంటున్నారు

* * *

ఎక్సెల్ ప్రొడక్షన్స్‌వారు నిర్మించిన తెలుగుచిత్రం "తండ్రి" ఈ నెలలోనే ఆంధ్రదేశంలో విడుదల చేయదలచినట్లు నిర్మాతలు తెలుపుతున్నారు. ఈ చిత్రం మళయాళంలో బాగా విజయం పొందిందట. అరవం, హిందీలలోకూడా దీన్ని నిర్మిస్తున్నారు "రక్తహారం" అనే మరొక నాలుగుభాషల సాంఘిక చిత్రాన్ని కూడా వీరు ప్రస్తుతం నిర్మిస్తున్నారు నటీనటులు బి ఎస్ సరోజ, తిక్కురిసి, ప్రేమ్‌నజీర్ మున్నగువారు.

* * *

## తాజ్‌మహల్

బొంబాయి మోడరన్ స్టూడియోస్‌లో 'తాజ్ మహల్', 'పులి, పులి' అను రెండు త్రివర్ణ చిత్రాలను హిందీ, ఇంగ్లీషు భాషల్లో తియ్యడానికి అలెగ్జాండర్ కోర్డా (లండన్ ఫిల్మ్స్)తో ఏర్పాట్లు, జరుగుతున్నాయి 'ఎలిఫెంట్ బోయ్' అనే చిత్రంలో సాబూను ప్రవేశపెట్టిన అలెగ్జాండర్ కోర్డా మరొక కొత్త తారను 'తాజ్ మహల్'లో ప్రవేశపెట్టనున్నాడని వదంతి 'పులి, పులి' అనే చిత్రంకోసం పని అప్పుడే మోడరన్ స్టూడియోస్‌లో ప్రారంభమౌతున్నదట. టెక్నికలర్‌లో చిత్రనిర్మాణానికవసరమైన ఏర్పాట్లుఅన్నీ స్టూడియోలో చురుగ్గా జరుగుతున్నాయి.

# గోడమీదబొమ్మ

(11-వ పేజీ తరువాయి)

సుక్కసుకుని, తాడవ కంటినట్టు యెగబీరిస్తే, ఆ పీమిడి పోతాదని మా అమ్మ సెప్పమంది. ఇయ్యాల యింటిదగ్గర యెయ్యించుకోమంది బాబూ!"

"రొంప చేసిందనెందుకు చెప్పావు?" అన్నాడు భద్రం. జవాబు లేదు. కిష్టయ్య కాఫీగ్లాసు బల్లమీద పెడ్తూ, యిద్దరి ముఖాలు చూసి, తేలిగ్గా అన్నాడు. "ఒ-ఒటేలు మెతుకులు మే-మేహించదూ? ఐనా యిదేమి వైద్యం."

"మా యీదిలో సూరమ్మకి ముక్కులో మూనేస్తే రొంప పోనాది బాబూ!" తను చెప్పిన మాటలను సమర్ధిస్తూ అన్నాడు రాములు.

"సరేలే. నీపని చూసుకో." అన్నాడు. ఇంతలో మిగతా యిద్దరు పనివాళ్లు వచ్చారు. వరండాలో దర్జీకూడవచ్చి కుట్టు మిషను బయట పెట్టుకున్నాడు. కిష్టయ్య వెళ్ళిపోతూనే, "మ-మళ్లీ సా-సాయంత్రం రమ్మంటావా?"

"అక్కర్లేదు. వస్తాను" అంటూ భద్రం ముక్కు రుమాలుతో తుడుచుకుంటూ లోనికి వెళ్లిపోయాడు.

కిష్టయ్య ఆవేళ ఆఫీసునించి వచ్చేసరికి చీకటి పడింది. రంగయ్యగారింటికి వెళ్దామనుకున్నా, భద్రం వేగంగా వస్తాడేమోనని యింటికి వచ్చాడు. తలుపు త్రోసిన చప్పుడవగానే సీతాలుకు శివమెత్తింది. "ఏ-ఏంటే గొడవ?" అని విసుక్కుంటూ కిష్టయ్య దగ్గరకు వస్తుంటే, పిల్లలను గదిలోనికి పంపించివేస్తూ సీతాలు భర్తకు యెదురువెళ్లింది.

"ఇదెక్కడి సంసారమమ్మా! నే చెయ్యలేను. మీరే చేసుకోండి." అని తల మొత్తుకుంటోంది. కిష్టయ్య యెగ్రగించి యెదురుగా వికారంగా వున్న భార్య వేపు చూశాడు. ఆమె మాటల నాపడం లేదు.

"ఇదెక్కడ న్యాయం? ఇదంతా నా కర్మ! నా దేవుడే నన్ను మోసం చేస్తాడనుకో లేదమ్మా!" కిష్టయ్య ఆమె వైపు చేతిని రొప్పిస్తూ, ప్రశ్నించాడు. "ఇ-ఇప్పుడేమిటొచ్చిందే?"

"ఇంకేం వచ్చింది? మీదగ్గర నేనెప్పుడైనా అబద్ధం ఆడానూ? మళ్లీ ఏం తెలీనట్లు అడుగుతున్నారు? మీ గుండెమీద చెయ్యివేసుక చెప్పండి." ఇరుగు పొరుగు వాళ్లకి వినిపించని కొంచెం దీర్ఘస్వరంతో అనగానే కిష్టయ్య ముఖంత్రిప్పేశాడు. వెంటనే మంచం మీద కూర్చుండి పోయాడు.

సీతాలు దగ్గరగా వెళ్లివంగొని, "నిజం చెప్పండి. ఇంత అడిగి తెచ్చారే; ఆ మాత్రం పదిరూపాయిలు ఖర్చు పెట్టుకుంటానంటే, వద్దంటానా?"

"ఏంటే! ఏ-ఏం పదిరూపాయీలు! నా-నాకేం తెలీదే!" అని మూలుగుతూ, గసురుతు, అభినయంతో, కొత్త ధాటిగానే డబాయించాడు.

సీతాలు నిటారుగా నిల్చుని, "సరిసరి! ఈవేళనే వెళ్ళి ఆ బాబును కనుక్కోకపోతే, మీ మాటే నిజమైపోను."

"ఎ-ఎక్కడికి వెళ్లావే? ఎ-ఎవర్ని అడిగేవే?" గాభరాగా ప్రశ్నించాడు. సీతాలు గంభీరంగా అంది, "రంగయ్య బాబునే! రెండుసార్లు లెఖ్ఖపెట్టి మరీ యిచ్చానమ్మా! ఏడు వందరూపాయినోట్లు, ముప్పై పదిరూపాయిలనోట్లు — సరిగ్గా వెయ్యిరూపాయిలు"

ఈ మాటలతో కిష్టయ్య వణికిపోయాడు. తలమొత్తుకుంటూ, "ఎ-ఎందుకు వెళ్ళావే? నా - నాపరువు తీసేశావు." సీతాలు దగ్గరగావచ్చి, "మీరెప్పుడైనా అబద్ధం ఆడ్తారని కలలోనైనా అనుకున్నానా?" అని గొణిగింది. మళ్ళీ స్వరం హెచ్చించి "చెప్పండి! ఏంచాసేరో లెఖ్ఖ చెప్పండి!"

కిష్టయ్య యిక ఆ పెద్దమనిషి ముఖం యెలాచూస్తానని మనసులో మొత్రోమని యేడుస్తుండడంవలన జవాబు చెప్పే పరిస్థితిలో లేడు. తల ముడుకుల్లో దాచుకొని విచార సాగరంలో మునిగివున్న ఆ దేవుని మీద యీ భర్తురాలికి దయ కలిగిందేమో మనసు కరిగి నిజం మెల్లగా చెప్పింది. అణచిపెట్టిన స్ప్రింగు విడిచినప్పుడు యెగిరినలా కిష్టయ్య మంచంమీదనుంచి ఒక్క యెగురు యెగిరి,

"నా-నాతోడు. వె-వెళ్ళలేదు కదూ?" సీతాలు ముసిముసినవ్వు నవ్వింది. ముఖానికి తగిలించుకొన్న అసహ్యమైన కృత్రిముపు అట్టచింపివేసింది- ఇప్పుడు కిష్టయ్య కంటికి యెంతో అందంగా వుంది! ఆమె భుజాలమీద చెయ్యి వెయ్యకుండా వుండలేక పోయినాడు.

"ఇప్పుడైనా చెప్పండి."

కిష్టయ్య గర్వంగా కూర్చుంటూ "మ-మరెక్కడ వుంది? అంతా సరి."

"ఇదేం కర్మమమ్మా! పదిరూపాయిలు ఒక్కరోజులో తగలెట్టేశారూ? నెలంతా కూర ఖర్చుకీ నూనె ఖర్చుకీ సరిపోనే-ఉం-చెప్పండి. ఏంచేశారో?"

"మా-మా ఆఫీసులో ఒక గు-గుమస్తా బా-బాగా కథలు రాస్తాడే!" నసిగాడు.

"బాగా రాస్తే"

"అందుకే ఎ-ఎవరూ చదవరు,"

"చదవకపోతే!"

"పా-పాపం ఎలాగో వొకలా ఒక పుస్తకం అచ్చు వేయింసుకున్నాడు."

"వెయ్యించుకుంటే?"

"మూ - మూడువందలు ఖర్చుపెట్టాడు. ము - ముప్పయి పుస్తకాలు చె - చెల్లితే వొట్టు."

"చెల్లకపోతే!"

కిష్టయ్య కొంచెం తీక్షణంగా, "ఏ-ఏంటా ప్రశ్న? నాకు క-కలిగింది. రెండు పుస్తకాలు కొ-కొనేసాసాను."

"కడుపుమంటలతో మనముంటే, ఇదేం ఖర్మమమ్మా! ఎవడో నష్టపడుతున్నాడట. ...వందలు తెచ్చుకొనేవాళ్లకు లేని దయ మనకు అబ్బబ్బా ఏమన్నానే గయ్యాలిని! పోనీ! ఆ మిగతా రూపాయలన్నా పారేయండి!"

"చూ-చూడు సీతాలు!" కిష్టయ్య చాల ప్రశాంతంగా, "మ-మన సుందరి పుట్టిననాటినుండి, ము-ముష్టోడికి ఒక కాని వెయలేదు. ఈ-ఈవేళకి నాకు కలిగింది."

"అయ్యో రామ! మనమే ముష్టివాళ్లలా వుంటే, మీ పుణ్యం వుంటుంది. ఆ మిగతా డబ్బు యిలా పారేయండి."

"వినేమరి! ఆ బె-బెంగాలీవాడు నాలుగేళ్ళయింది ర-రసుగుల్లాలు అమ్ముతూ, అప్పటినుంచి తి-తినాలని కోరిక" కిష్టయ్య నోరు చప్పరించుకుంటూంటే, సీతాలు తల మొత్తుకుంటూ, "ఇదేం ఖర్మమమ్మా! పిల్లలకు పెట్టకుండా తినడానికి మీకు నోరెట్లా వచ్చిందండీ? మిగతాదయినా యిలా పారేయండి" అంటూ చెయ్యి చాపింది. కిష్టయ్య యేమీ లేనట్లు చెయ్యివూపాడు.

"పోనీ సినిమాకు రూపాయ వుంచుకొని మిగతాది పారెయ్యకపోతే రేపు వెళ్తాను!"

భార్య వైపు ముద్రచేస్తూ గజ గజమెలను దాచిన ఐదు రూపాయల నోటు తీసి క్రిందపారేశాడు. సీతాలు నవ్వుతూ గభాలున నోటు తీసికొని గదిలోకి వెళ్లిపోయింది. అమ్మాజీ యిక మల్లిగాడిని ఆపలేకపోయింది. తండ్రిదగ్గరకు వచ్చి క్రిందనె మొగ్గలు వేస్తున్నాడు. కొంతసేపయ్యాక వీధితలుపు త్రోసుకుని వస్తున్న భద్రాన్ని చూచి మల్లిగాడు గదిలోనికి పారిపోయాడు. భద్రం వరండాలో కాబూలు సాండల్సు విప్పి, పకోడిపొట్లాం చేతపట్టుకుని, "మల్లిగా వేడీ! బొల్లిగా వేడీ!" అంటూ గదిలోనికి వెళ్లి, తలుపు వెనుకను

దాగున్న మల్లిగాడిని పట్టుకుని, "ఇదుగో-" అంటూ పైకి లాగాడు. మల్లిగాడు కిలకిల నవ్వుతూ, గెంతుతూ తన ఒంటి మురికి నంతనూ భద్రం తెల్ల షేంటుకు అంటించాడు. ఇంతలో సీతాలు నవ్వుతూ,

"సరి! షేంటు పాడుచేశాడూ? వాడికెందుకు..." భద్రం నవ్వుతూ, "వాడు లేకపోతే నేను యీ యింటికి వస్తానూ?" అంటూ మల్లిగాడిని దగ్గరకు లాక్కుని, చేతికి పొట్లాం యిచ్చి, "ఇదేంటి అక్కా! ఈ వేళ ముఖానికి యింతబొట్టు పెట్టాడు?"

"ఈ సాయంత్రం కనకమహాలక్ష్మి అమ్మవారి దగ్గరకు వెళ్లాం. బాగా మొక్కాడు కాబట్టే యీవాళ పకోడీ పొట్లాం వచ్చిపడింది."

భద్రం రుమాలుతో ముక్కు తుడుచుకోవడం చూసి, "మీ బావ చెప్పారు, రొంప చేసిందని. మిరియాలచారు చేశానులే." భద్రం గది బయటకు వస్తూ, వాకిట్లో విగ్రహంలా కూర్చున్న కిష్టయ్యను చూచి, "ఇదేమిటి! బావగారీవేళ మహారాజశ్రీ పద్దులో వున్నట్టున్నారు! ఏం అక్కా! మొన్న బావ నాలుగడిగితే రెండు రూపాయిలే చేతిలో పెట్టాను. ఊర్లో సినిమాలన్నీ మంచి లవ్ స్టోరీలతో నిండిపోయియున్నాయని..." కిష్టయ్య అప్పటికీ మౌనం దాల్చటం, ముఖం చూడకపోవటం, భద్రంకు ఆశ్చర్యం కలిగించినా, సీతాలు మధ్యను కలుగజేసికుని, "ఏముంది తమ్ముడూ! ఈ వేళ మా సంతోషమెంతో, దుఃఖము అంతే. ఆ కనకమహాలక్ష్మి చల్లని తల్లి వుండగా మన కష్టాలెంత కాలం వుంటాయి?"

మొదటి వాక్యం రాటానికి కారణం భద్రంకు స్ఫురించలేదు. సీతాలు "భోజనానికి లే తమ్ముడూ!" అంటూ రెండు చెంబులతో నీరు తెచ్చి వరండాలో పెట్టింది.

కిష్టయ్య లేవకపోవడం చూచి భద్రం నవ్వుతూ వంటయింట్లోనున్న సీతాలుతో అన్నాడు. "పంక్తిలేదని నేనేం అనుకోనులే. వారు అలక సాగించినట్టుంది. ఏం మిగిలినా మిగిలిందేలే అక్కా!"

కిష్టయ్య లేస్తూ యిప్పటికి అందుకున్నాడు. "ఎ-ఎవరోయ్ వారు?"

"నువ్వే బావా!"

"తి-తిమ్మన్నగారూ బా-బాగున్నారా అంటే, నేను తి-తిమ్మన్ననని నీకేం తెలుసండట! ము-ముఖాన్నవుంటే అ-అలిగేవాళ్లెవరో?"

వడ్డన పూర్తిచేసిన సీతాలు, "యీ పరసాల మాటకేం కాని, భోజనానికి లేవండి!"

భద్రం భోజనంచేస్తూ, "ఏంటక్కా! ఈ వేళ విశేషం?" అన్నాడు. సీతాలు చెప్పిన అబద్ధం ఆడవలసివచ్చింది. ఆ నెలలోనే మల్లిగాడి పుట్టినరోజయినా ఆ రోజుమాత్రం కాదు.

"ఏంలేదు. మల్లిగాడు పుట్టినరోజు, నాలుగో యేడు పోయి అయిదో ఏడు వచ్చింది."

"అయ్యో! బావ చెప్పాడుకాదేం? పుట్టినరోజునకూడ దిగంబరుడిగా వదిలేశారు?"

"ఉండనీవోయ్! గొ-గొప్పవారికి వే-వేషాలతో యేంపని?" కిష్టయ్య అందుకోగానే, భద్రం బలవంతాన నవ్వు నాపుకుంటున్నాడు.

సీతాలు చారుపోస్తూనే "వ్యాపారం బాగా సాగుతోందా తమ్ముడూ?" భద్రం తలెత్తి అభినయంతో "ఊరంతా ఒక్కటవనీ అక్కా! నాకేం భయంలేదు. నాకేం చాతకాదని వీళ్ళంతా అన్నా..."

"ఎవరంటారు తమ్ముడూ?"

"అంటారక్కా! మీ చుట్టం ఆ వెంకట్రావే అన్నాడు— పంది బ్రతికిందీ, కుక్క బ్రతికిందీ అని—పూర్తి అప్రయోజకుడెవడంటే నేనేట!"

"నిజం చెప్పాడు." కిష్టయ్య గొణిగాడు.

"చెప్తాడు-చెప్తాడు" కోపం ముక్కువరకు రావటంవల్ల పళ్లు బిగించి మరి మాటలాడలేకపోయాడు.

"చెప్పగా చెప్పగా యిన్నాళ్ళకయినా యిది నాది అన్న అభిమానం పుట్టింది తమ్ముడికి. ఐనా, భాగవారికి కళ్లలోను, నాగుపాముకి పళ్లలోను విషం వుందంటారు!

"ఆ రామం, మీ బావైనా ఆస్తిలో భాగాన్ని హరించడా? ఏ ఎండ కా గొడుగు పట్టకపోతే బ్రతగ్గలమా తమ్ముడూ?" కిష్టయ్య యేదో అందామనుకున్నాడు. భార్యమీద కోపం యింకా చల్లారనందున యేమీ అనలేకపోయాడు.

భద్రం లేచి చెయ్యి కడుక్కుంటూ, "ఈ వారం రోజుల్లో వెయ్యి రూపాయిలు వరకు పోగుచేశాను. ఒక్కసారి బొంబాయి వెళ్ళివచ్చావంటే మళ్ళీ కొట్టు నిండిపోతుంది. నాకు చేతనయినట్లు నడుపుకుంటాను. వీళ్ళు త్రిప్పినట్లు తిరిగే అవసరం నాకేం పట్టింది?"

"మంచిదే తమ్ముడూ!" అంటూనే గది లోనికి వెళ్తూ "ఒక్కసారి ఇలా వస్తావా?" అంది. భద్రం రుమాలుతో చేతిని తుడుచుకుంటూ లోనికి వెళ్లాడు. అమ్మాజీ గది బయటకు రాగానే, సీతాలు భద్రం చెవి దగ్గిరగా జరిగి, "ఇప్పుడే నువ్వింటికి వెళ్లిపోవాలి తమ్ముడూ!"

భద్రం యీ వైఖరి అర్థంకాక సంశయంగా ఆమెవైపు చూశాడు. సీతాలు అతని రెండు చేతులు పట్టుకుని, "నివ్వింటికి వెళ్ళకపోతే నన్ను చంపుకుతిన్నట్లు! చిన్నాడివయినా బ్రతిమాలుతున్నాను. తక్షణం వెళ్లిపోవాలి."

భద్రం పెదిమలు విరుచుకుంటూంటే సీతాలు, "సాయంత్రంనుంచి మనసు మనసులా లేదు. ఆ మాట విన్నాక నాకెక్కడ లేని భయం పుట్టింది తమ్ముడూ! ఒక్కగాని ఒక్కడు - నీమీదేనా యిందరికి కక్ష!" కళ్లు చీరకొంగుతో తుడుచుకుంటూ అంది.

"నాకేం అర్థం కాలేదు."

సీతాలు విచారవదనంతో, "ఆ కనకమహాలక్ష్మి అమ్మవారి దగ్గరకి మీ యింటి పొరుగావిడ వచ్చింది. ఏదో మాటమాటగా వరసమ్మ తల్లి బాగుందమ్మా! అని అడిగాను. అంతా చెప్పుకొచ్చింది. ఏం చెప్పను?"

"అది ఆ ఇంట్లో వుంటే నే వెళ్ళనని చెప్పలేదక్కా?"

"నీ యింటికి వెళ్లటానికి దాని అడ్డేంటి? ఎప్పటికయినా నీతో దానికి మోతుంగాని - ఎవరైనా ఫలానివాడి పెళ్లాం అంటారుగానీ, ఫలానివాడి చెల్లెలనరు గదా— అయినా స్వంత చెల్లెలకే లేదు. నేనా నాటినుండి చెప్తున్నాను. నీ ఇల్లు! నీ అధికారం! నీవు పొమ్మంటే ఎవడికోసమని హడలెత్తి మరీ అత్తారింటికి పోయాడు! అలాగే యిదీ. యింకా చిన్నపిల్ల - కాస్త ఎర్రగించిచూస్తే ఒక మూల పడివుంటుంది. ఇదంతా వాదీ అని చూసుకుంటే నీకు అడ్డేవారెవరు? నామాట విను తమ్ముడూ!"

"నీకు తెలియదక్కా! నేనే వాళ్ళకి కావలసివుంటే, నేను చెప్పినట్లు అదైనా వినాలి లేదంటే నాకింకో పెళ్లయినా చేయాలి."

"అయ్యో! పిచ్చితమ్ముడూ! ఇన్నాళ్లు యింత అమాయకంగా వుండబట్టె యింత అన్యాయం జరిగింది. బెల్లం వున్నచోట

# ★ గోడమీద బొమ్మ ★

ఈగలు మూగవా? ఆ సుందరమ్మ నువ్వున్నావని యేనాడైనా యింట్లో అడుగైనా పెట్టిందీ? దాని సంగతి నీకు తెలుసుగా-ఆవులిస్తే పేగులు లెఖ్ఖపెడుతుంది. పోలీసోడి పెళ్లాం. అప్పుడే సగంఆస్తి కబళిద్దామని చూస్తోంది! ఊరంతా నివ్వు పోకిరీ అనేస్తున్నారుగానీ అసలు సంగతి వాళ్ళకేం తెలుసు. నీ "యింటో నీ అధికారం చూపించి నీ యిష్టంవచ్చిన రుచి పచులు తిన్నదానికీ హోటల్లో యెంగిలి మెతుకులు తిన్నదానికి భేదం లేదు తమ్ముడూ?"

"నివ్వెంత చెప్పినా ఆ యింటికి వెళ్లాలని లేదక్కా-దాని ముఖం—ఆ ముసలాడి పిచ్చి—"

"పిచ్చి అంటున్నావా తమ్ముడూ? ఇప్పుడంతా ఆయన చేతిలోనేవుంది. మనం యిలా జట్టుసరిగావుండి ఆ ముసలాడ్ని కష్టపెట్టామంటే, తరువాత అడుక్కుతినాలి. నామాట విను. సాయంత్రం ఆవిడ చెప్పినదగ్గరనుంచి నామనసు పాడైంది. ఇలాంటి కొడుకెందుకు? ఎప్పటికయినా అయ్యోవాడా రామం. వాడికే ఆస్తంతా రాసేస్తానన్నాడట! చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభంలేదు. మనసు విరగకముందే నువ్వు వెళ్లాలి."

ఆమె చెప్పాలని యీ మాటలు చెప్పినట్లుగా లేదు. మాటలు గొంతుకనుంచే రాలేదని స్పష్టంగా కనిపిస్తోంది. ఆ క్షణాల్లో నిజంగా ఆమె నటించలేదు. సహజంగానే కళ్లు చెమ్మగిల్లినయి. అంతలో కిష్టయ్య గదిలోనికి వచ్చినసంగతి సీతాలు గమనించలేదు. భద్రం అక్కడనుంచి బయటకు వచ్చాడు.

"ఏ-ఏంటే నూ-నూరిపోస్తున్నావూ? ఏ-ఏం యిస్తాడనా? పి-పిసినారి."

సీతాలు యిప్పటికి కంఠం సర్దుకోవలసి వచ్చింది. "ఏంచేసినా చేస్తాను. ఏమన్నా అంటాను. నా తమ్ముడు పచ్చగావుంటే పిల్లలు కలదాన్ని చెయ్యి చాపటానికి నాకధికారం లేదూ?"

భద్రం వెళ్లిపోతానని చెప్పబోతుంటే, సీతాలు దగ్గరగావచ్చి, "తమ్ముడూ! నేనెందుకింతగా చెప్తున్నానో బాగా ఆలోచించు. ముసలివాళ్ళు పిల్లలతో సమానం. ఆ సుందరమ్మ నువ్వు దగ్గరలేకపోతే తన యిష్టం వచ్చినట్లు ఆడించదూ?"

కిష్టయ్య చప్పన "సు-సుందరమ్మనెందుకు తెస్తావే—మ-మధ్యను?"

"మీకు తెలియదు వూరుకోండీ! తన ఆస్తి యివ్వటానికా యిల్లరికం తీసుకెళ్లిందీ? ఇదిదో కబళిద్దామని. అప్పుడే రావటం పోవటం అంతా జరుగుతుంటే?"

కిష్టయ్య తల పంకిస్తూ, "అ-అంతవరకు వ-వచ్చిందీ!" అన్నాడు.

భద్రం, "వస్తాను అక్కా!" అంటూ ముందుకు సాగాడు. సీతాలు వెంటపడుతూ, "తిన్నగా యింటికే కదూ-తమ్ముడూ?" భద్రం మాట్లాడకుండానే గుమ్మం దాటాడు. మౌనం అర్థంగీకారంగా తలుస్తున్న సీతాలు భర్తను. "ఇంటివరకు దిగవిడచి రమ్మని" నిలబడ్డపాటునే తరిమింది.

సీతాలు చేతులు నులుపుకుంటూ, కుక్కి మంచంమీద కూలబడి నవ్వుకుంది. కనకమహాలక్ష్మికి రేపే తన మ్రొక్కు చెల్లించుకుంటానని హామీ యిచ్చింది. ఆ మంచి బాబు, ఆ మహాదాత యిల్లు కలకాలం ఆ తల్లి దయవలన నిత్యకళ్యాణంగా వుండాలని ప్రార్థించింది. తన భర్త అనవసరంగా కలుగచేసుకోకుండా వుండటం, అనుకోకుండా వచ్చిన అబద్ధాలు నిజాలుగా భద్రం తీసుకోవటం, యిదంతా ఆ అమ్మవారి అనుగ్రహంవల్లనే జరిగిందని సంబరపడ్డది. కొంతసేపటికి లేచి మంచాలు సర్దటం ప్రారంభించింది. అమ్మాజీ యేదో కథ చెప్తూంటే గదిలో పిల్లలు అల్లరి చేయకుండా వింటున్నారు.

కొద్దిసేపటిలో కిష్టయ్య వచ్చాడు. అమ్మాజీ చెప్తున్న కథ క్లైమాక్సుకు రావటంవల్ల మల్లిగాడు కూడ 'వూఁ' కొడ్తున్నాడు యెంతో అర్థమవుతున్నట్లు. కిష్టయ్య మాట్లాడకుండా పరుపుమీద చారబడ్డం చూచి సీతాలు, "ఇంటిదగ్గర మరేం గొడవ జరగలేదు కదా?" అని ప్రశ్నించింది.

కిష్టయ్య చిరాకుగా, "వా-వాడెక్కడ వెళ్లాడే!"

"వెళ్ళలేదూ—ఛా! అబద్ధం ఆడకండీ!"

కిష్టయ్య వెక్కిరించినట్లుగా మూలిగాడు.

"నాతోడని. నిజం చెప్పండి"

కిష్టయ్య చిరాకుపడే గొంతుకతో, "బా-బాగుపడేవాళ్ళ ల-లక్షణాలే వేరు! నా-నాలుగు తిట్టి వచ్చేశాను. ఒ-ఒంటి పిల్లిలా ఆ కొట్టులోనే ప-పడుకున్నాడు"

సీతాలు చిన్నబుచ్చుకొన్న ముఖంతో అక్కడే కూలబడిపోయింది. అంతవరకూ చెప్పిన కథ అమ్మాజీ అంతంచేసి "కథ కంచికి, మన మింటికి" అని దీపం తగ్గించింది.

(ఇంకావుంది)

# ★ కార్నర్ సీట్ ★

(6-వ పేజీ తరువాయి)

దిగి అటువైపుకి తొందరగా గాభరాగా నడిచేడు రాజు.

"అబ్బ! ఒక్క సెకండే చూసేను. కాని నాకీ జన్మలో నిద్రపట్టదు" అని ఎటూ వెళ్ళక మధ్య నిల్చున్న పెద్దమనిషి ఎవరితోనో అంటున్నాడు.

అందర్నీ అటువైపునుంచి తోసుకు వస్తూన్న కూలిమనిషిలా కనిపించే ఆడమనిషి వెక్కి వెక్కి ఏడుస్తూ వస్తోంది.

"ఏమవుతాడమ్మా? నీ కతనేమవుతాడు?" అని పదిమంది ప్రశ్నించేరామెని.

"ఏమవుతాడు బాబూ! మీ కేమవుతాడో నాకూ అదే అవుతాడు. నిండు ప్రాణమా, మజాకావా? పోతే ఏడుపు రాదూ" అన్నదామె కళ్ళు తుడుచుకొంటూ. ఆ జవాబు వినని వాళ్లు ఆమెని ఇంకా ఏదో అడుగుతున్నారు.

"అతనేనండీ, అతనే! మా కంపార్ట్‌మెంట్లో నా యెదటే కూర్చున్నాడు. ఒట్టి ఒకార్లా ఉన్నాడు. సామానూ సరంజామా ఏమీ లేదు. ఏవూరు వెళ్తున్నావని నే నడిగితే మాట్లాడేలేదు. మనిషి వాటం చూస్తే అప్పుడే వింతగా తోచింది నాకు" అని అందరితో చెప్తూన్న వీడెవడు?

వీడు వెనక్కిటికి కార్నర్ సీట్లో ఇందాట్లా కూర్చున్నవాడు.

ఎక్కడకి వెళ్తున్నావని నేనుకదా అడిగేను! మరి వీడెందుకిలా చెప్తున్నాడు?

గొప్పకి! గొప్పకోసం అలా చెప్తున్నాడు.

చచ్చిపోయినవాణ్ణి చచ్చిపోయేముందు పలకరించేనని చెప్పినవాడితో మాట్లాడ్డానికి జనం తోసుకు వస్తున్నారు.

పదిగంటలయింది. ఎండ తీవ్రంగా లేదు. కాని చుట్టూ అంతా సుస్పష్టంగా కాంతిమయంగా కనిపిస్తోంది. దూరాన్నించి వస్తోన్న రైలు పట్టాలు నాగుపాముల్లా మెరుస్తున్నాయి. ఏం చెయ్యాలో తోచని పోలీసువాడి చుట్టూ ఎర్రటి, నల్లటి, పచ్చటి ముఖాలు కలవరంతో, ఆశ్చర్యంతో, అసహ్యంతో, బాధతో, క్యూరియాసిటీతో తిరుగుతున్నాయి.

దగ్గరగా వెళ్ళలేక కొంచెం దూరాన్న నిల్చొని చూసేడు రాజు.

చుట్టూ చేరినవాళ్ళ మధ్య సందుల్లోంచి చనిపోయినవాడి అరిపాదాలు మాత్రం కనిపిస్తున్నాయి.

అరిపాదాలు అలా వున్నా యేమిటి? నిజంగా చనిపోయిన మనిషివేనా ఆ పాదాలు? ఎన్నాళ్లు ఎన్ని బాధలు పడ్డ మనిషిని ఎలా మోసుకు తిరిగే యవి?

"ఇకా నే చూడలేను భగవంతుడా" అనుకొన్న రాజు, వెనక్కి ఇంజన్‌వైపుకి, తన కంపార్ట్‌మెంటువైపుకి మళ్ళేడు. పోయి తన సీట్లో కూర్చున్నాడు.

చుట్టూ చూస్తే ఇంకా ఎవరో కొత్త ప్రాసెంజర్స్ కూడా వచ్చి కూర్చున్నట్లుగా వుంది. కొంచెం ఆలస్యం చేస్తే తన సీట్లో కూడా ఎవరో వకరు కూర్చొనే వుందురు. వేగిరం రావడం నయమే.

ఎదట కార్నర్ సీట్లో సామాను పెట్టుకున్న వృద్ధుడెవరో కూర్చున్నాడు. రాజు కూర్చున్నాక రెండు క్షణాలు పోనిచ్చి, అతను, టోపీ చూపిస్తూ "ఎవరో కాని టోపీ మర్చిపోయి దిగిపోయినట్టుందండీ" అన్నాడు రాజుతో.

"చచ్చేప్పుడు కూడా నెత్తిమీద టోపీ ఉండాలా?" అన్నాడు రాజు.

"మీరు చెప్పేది నాకర్థం కాలేదు"

"ఇందాట్లా చచ్చిపోయిన వాడిదండీ ఆ టోపీ! తొందర్లో వదిలేసి ఏకంగా దిగిపోయేడు."

"ఇక్కడేనా ఏమిటి వాడు కూర్చున్నాడు?" అని టోపీకి, కొంచెం ఎడంగా జరిగేడు సామానులవాడు.

"అహా! సరిగ్గా ఆ సీట్లోనే, మీరు కూర్చున్న చోటే."

సామానులవాడు కొంతసేపు తటపటాయించి, ఏదో పనున్నట్టుగా లేచి గేటువైపు వెళ్ళి అక్కడ బల్లమీద కూర్చున్నాడు.

వాడంటే ఎంత భయం! చచ్చినవాడి సీట్లో కూర్చుండికే భయం, అనుకొని ఖాళీ అయిన కిటికీ కార్నర్ సీట్లో కూర్చుందామా మానదామా అని ఆలోచించి "కూర్చోడానికి నాకు భయం లేదు. కాని తరువాత చూద్దాం" అని అక్కడ కూర్చోడం మానేశాడు రాజు.

"ఆ టోపీ నిజంగా వాడిదేనండీ?" అని ఎవరో అడిగేరు.

"అవును మహాశయా"

"పాపం!"

ట్రెయినింకా కదల్లేదు. ఇంకా ఆలస్యం అవుతుంది కాబోలని ఎవరో విసుక్కుంటున్నారు. కిటికీలోంచి పైకి చూస్తున్నాడు రాజు.

ఆకాశం చెప్పలేనంత నీలంగా ఉంది. దూరంగా, చాలా దూరంగా మామిడితోటలకి ఆటితోపుకి వెనక కనపడీ కనపడక దాగుంది ఏదో వూరు. సన్నగా ఆ వైపు నుంచి లేచిన పొగ అక్కడే ఉండి పోతోంది. మామిడిచెట్లకి ముందున్న చెరువుగట్టున స్నానం చేసిన బ్రాహ్మడు గామంచాతో తుడుచుకొంటున్నాడు స్టేషన్ వైపు చూస్తూ. దూరానికి అతను పచ్చగా కనిపిస్తూ, తెల్లటి చుక్కల్లా బాతులు ఈదే చెరువు నీటిలో దూరంగా అచలంగా నిల్చున్న నీలి కొండలూ, ఎండలో వెండి ముద్దల్లా కనిపించే తెల్ల మబ్బులూ, కదిలిపోతున్నాయి. చెరువుకి పక్కగా ఉన్న తాటాకుల ఇంటిముందు విరియపూసిన గన్నేరు చెట్టు బరువుగా కొమ్మలు వంచుకొంది. బాగా ఎదిగిన అమ్మాయెవరో కొమ్మల్ని వంచి నీలంగా ఉన్న చీర చెంగులోకి కెంపుల్లాంటి పువ్వుల్ని కోసి వేసుకొంటోంది. కోతకి సిద్ధంగా ఉన్న వరిచేల మధ్యనుంచి పల్లెపడుచెవరో పోతోంది వయ్యారంగా నడుచుకొంటూ.

దూరంనుంచి, రాజు కూర్చున్న స్థలం నుంచి చూస్తూంటే, అంతా ప్రశాంతంగా హాయిగా కనిపిస్తోంది. చిన్నగా, సొంపుగా రంగుల బొమ్మలా ఉంది. టూరిస్ట్ ట్రాఫిక్ కోసం అడ్వర్‌టయిజ్ చేసే త్రివర్ణ చిత్రంలా ఉంది. ఎంతో మనోహరంగా ఉంది.

అవన్నీ, అదంతా చూస్తోన్న రాజెందుకోగాని వికల మనస్కుడయ్యేడు.

కార్నర్ సీట్లో కూర్చున్నంత మాత్రాన్న పచ్చకోటువాణ్ణి పరమ శత్రువుగా భావించిన సంగతి మర్చిపోయేడు రాజు. కాని అతని కెందుకోగాని దిగులుగా ఉంది.

ఈ నీలపు కొండలూ, నీలి ఆకాశం, ఈ శీతాకాలపు ఎండా, బాతులు ఈదే చెరువూ, స్నానం చేసిన బ్రాహ్మడూ, ఎక్కడకో పోతోన్న పల్లెపడుచూ, పువ్వులుకోసే జవ్వనీ, ఏవీ ఏదీ ఎవర్నీ కూడా చూడలేదే పచ్చకోటువాడు!

ఈ జీవితంలో ఎట్టి బాధల్ని భరించలేక, ఎన్నెన్ని బాధలు చూడలేక చూడకుండా పోయేడు పచ్చకోటువాడు? ప్రాణాల్ని ఇనపపట్టాలమీద పోగొట్టుకున్న పచ్చకోటువాడు ఇప్పుడేమిటి చూస్తూ ఉంటాడు?

అని రాజు ఆలోచిస్తూ ఉండగా ఇంజన్ పెనుబొబ్బ పెట్టింది. రెయిల్ గాడీ కదిలింది. నడిచింది. పరుగుతీసింది.

## కార్నర్ సీట్

ఎండలో మిలమిల్లాడుతూ మెరిగాడుతూన్న టెలిగ్రాఫ్ తీగలవైపూ, వెనక్కి గాభరాగా జరిగిపోతూన్న టెలిగ్రాఫ్ స్తంభాలవైపూ చూడక చూస్తోన్న రాజుకి గుండెల్లో ఎంతో బరువుగా, మనసులో ఎంతో దిగులుగా ఎందుకుందో అర్థం కాలేదు. ★

## మా అన్నయ్య

(27-వ పేజీ తరువాయి)

న్నాను," అంటూ ఒక్క దూకున బయటకు రాబోయింది. మా అన్నయ్య గబుక్కున లేచి "నేనే సుధా రాత్రి బండికి వచ్చాను. అంత ఖంగారెందుకు..." అంటూ వుండేసరికి "హా అఅఅ ఏమిటీ దారుణం" అంటూ నేను గదిగుమ్మంలోనికి వచ్చాను. అన్నయ్య చటుక్కున మంచంమీద పడుకుని ముసుగు తన్నేశాడు. సుధ లేడిలాగ ఛంగున ఒక్క గంతేసింది, తన గదిలోకి నేను పకపక నవ్వాను.

అన్నయ్య ఇంక తగిపోయి "ఏమిటే అల్లరి శిక్షి" అంటూ చల్లగ బయటికి జారుకున్నాడు."

పైకి వాళ్ళు నన్ను పేటులదగ్గర కోస్తున్నారు, కాని నేను కల్పించిన యీ సమావేశానికి ఎన్నెంత అభినందిస్తున్నారో! నా గదిలో కూర్చొని "నీ ఆసలు తెలుసునులే నీ నటలున తెలుసునులే" అంటూ స్వప్నసుందరి సినిమాపాట పాడుకుంటున్నాను, హాల్లో కూర్చున్న మా అన్నయ్యకి వినపడేలాగ.

ఆ మర్నాడు ఏవో మాటల సందర్భములో మా అమ్మ అన్నయ్యదగ్గర పెండ్లి ప్రస్తావన యెత్తింది. "ఎలాగూ నీ చదువు పూర్తవుతోంది కదా యింకొక రెండు నెలలలో. మే నెలలో మంచి ముహూర్తము లున్నాయని మామయ్య దగ్గరనుంచి జాబు వచ్చింది. అమ్మమ్మ వుండగా ఆ మూడు ముళ్లు పడితే ఆవిడ మనస్సుకూడ సంతోషపడుతుంది," అని ఓ దండకము మొదలెట్టింది.

"యిప్పుడేమి తొందర మూర్తి ప్రాక్టీసేనా పెట్టుకుండా" అంటూ వాయిదా వేయబోయాడు అన్నయ్య. మాటల మధ్యలో "ఏదో తల్లిని కనుక చెబుతున్నాను. ఈ విషయంలో మటుకు నీ వేమీ అడ్డం చెప్పకు, మీ నాన్నగార్కీ మీ మామయ్యకి, అందరికికూడ త్వరలో చేసేద్దామని వుంది" అంది. "సరే మీ యిష్టం" అన్నాడు ఆఖరికి అన్నాయ్.



గొల్లభామ

చిత్రకారుడు: శ్రీ కె. తిరులరావు, మద్రాసు.

వదినని యింకా బాగా వేళాకోళములు చేయవచ్చు ముఖ్యముగ ఆడబడుచు లాంఛనాలు వస్తాయి పెండ్లిలో మన వాగ్ధోరణంతా చూపించి అందరినీ నవ్వించాలి. మా అన్నయ్య పెండ్లిదగ్గర కొచ్చేస్తున్న కొలది నా ఆత్రము ఎక్కువయిపోయింది. అట్టహాసంగ మగ పెండ్లివారమంతా మా మామయ్యగారి వూరు చేరుకున్నాము. మా మామయ్య అత్తయ్యకూడ ఎక్కడ లోపాలు వస్తాయోనని అడుగులకు మడుగులొత్తుతూ ఎంతో మర్యాదలు చేశారు. ప్రతిదానికీ వంకలు పెట్టే నా నోరే కట్టడిపోయింది వారి మర్యాదలు చూసేటప్పటికి. మంగళ వాయిద్యములు మ్రోగుతూవుండగా మా అన్నయ్య సుధ మెళ్ళో మంగళసూత్రం కట్టేడు. ఇక మా ఎరువు వదిన ఒక్కమారుగ అచ్చంగా స్వంత వదినయి కూర్చుంది. మా అన్నయ్య పెండ్లయిపోయింది. మా అన్నా వదినలతో కలసి మావూరు వెళ్ళిపోయాము. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.

పంచతంత్రం



# మిత్రలాభం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



మరొక పడు గడచుసరికి - సాలెవాని చేతిలోన - అయిదువేల వరహాలు - ఘలు ఘల్లున మోగాయి.

పదిలంగా మూటకట్టి ఇదివరకటి దారివదిలి మరొకదారిపట్టి నడచి అడవి దాటి పోసాగెను



కొంతదూర మేగుసరికి - ప్రొద్దుగ్రుంకనందువల్ల - ఏదో ఒక చెట్టునెక్కి - రాత్రి గడపదలచాడు - తీరా ఒక మర్రిచెట్టు - ఎక్కి చూడ్డక్రితం పడు - ఆతడెక్కిన చెట్టే అది! - ఆ వృక్షం యిచటికెట్టు - వచ్చి నదని తెల్లబోయి - సర్లే అని మాట్లాడకే - మేను వాల్చి నిదురించెను.



కళ్ళు మూసినాడో లేదో వెనుకటి ఆ 'శ్రేయా', 'కర్మ' తిరిగి ఎదుటి కొచ్చారు.






వెంటనే ఆ సాలెవాడు లేచి డబ్బు చూసుకొనగ అయిదువేల వరహాలూ మటుమాయం అయినాయి



ఈ విధముగ రెండు సార్లు కష్టార్జితమగు ధనము నతి కొద్దిసేపట్లో వచ్చి రెక్కలొచ్చి ఎగిరి మాయమౌట చూచి యతడు పిచ్చి పిచ్చి ఆలోచనలకు ని రాశ చేసుకొన్నాడు



తాడొక్కటి వెదికి తెచ్చి - కొమ్మకు వేళ్ళాడ దీసి - వురిపోసుకు సాహసము - చేసు కొనగ జూచాడు!



అప్పుడంతరిక్షంలో - ఆ విచిత్ర వ్యక్తులలో ఒకడు కానుపించినాడు
















సాలెవాడు 'సరే' యని వర్ధమాన నగరానికి పయనం సాగించాడు.






## శ్రీ విజయనామ సంవత్సర

# పంచాంగం

శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిసిద్ధాంతిగారిచే గుణించబడిన

ఈ సంవత్సరం పంచాంగంలో చాంద్రమాన, దృక్సిద్ధాంతాల ప్రకారం
రెండుపద్ధతుల తిథి, నక్షత్రాదులు వేర్వేరుగా చూపబడినవి.

---

## కొత్తపంచాంగాలు సిద్ధముగా నున్నవి.

---

| | | | |
|---|---|---|---|
| 44 పుటలు | వెల ప్రతి | 1-కి | 0-3-0 |
| ,, | ,, 100 | 1-కి | 16-8-0 |

**పంచాంగములు మా ఏజంట్లవద్ద దొరుకును.**

రైలు ఖర్చులతో సహా పంపబడును.

వివరాలకు వ్రాయండి:

మేనేజరు:—

## ఆంధ్రపత్రిక; మద్రాసు-1.

